

ఓం.

నమః పరమాత్మనే

శ్రీమత్పరమహంస పరి[illegible]చార్య

శ్రీఅద్వైతానందతీర్థస్వా[illegible]

# దీపికాప్రభామండనము.

వీరిచే రచియింపబడిన గ్రంథపుస్తకముపైని

బెజవాడవాస్తవ్య రామకృష్ణయజ్వశాస్త్రి

తెనాలివాస్తవ్య గురునాథశాస్త్రి

ఈ ఉభయులుజూపిన యాక్షేపములకు సమర్పకముల నిచ్చునవి

జూచువారికి మంచి తత్వనిశ్చయమును గలిగించునవి

సర్వజనులకు తెలియునట్లు తెలుగుభాషలో రచియింపబడి.

తదంతేవాసులగు బెజవాడవాస్తవ్య

పైడిమఱ్ఱి బుచ్చివెంకటరామశాస్త్రి మొదలగువారిచే

బెజవాడ నగరములో

మ-రా-రా-శ్రీ దాసు కేశవరాయప్రతిష్ఠాపిత

వాణీ ముద్రాక్షరశాలలో

టి. కే. స్వామిచే పరిశోధనపూర్వకముగ

ముద్రింపబడినది.

1916 సం.

ఈ గ్రంథములను బెజవాడ వాస్తవ్యులైనట్టి [illegible] గారి పైడిమఱ్ఱి బుచ్చివెంకట రామశాస్త్రి [illegible] గారి వద్దను లభించవచ్చును.



శ్రీమదుమామహేశ్వరాభ్యాంనమః.

శ్రీలక్ష్మీనారాయణాభ్యాంనమః.

శ్రీవాణీహిరణ్యగర్భాభ్యాంనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీసద్గురుభ్యోనమోనమః.

# ప్రభామండనము.

---

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే - సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీయుగధారిణేనమః ౧

ముఖీనకృష్ణాచార్యాన్ లలనాభాగ్యశాలినః
సర్గస్థితిలయోన్నిద్రాన్ వందేదేవాన్ పరాత్పరాన్॥ ౨

శివరామసదానందతీర్థాన్ గురుసత్తమాన్ గురూన్
వాణీం గణపతిం వ్యాసం ప్రణమామి ముహుర్ముహుః॥ 3

రామకృష్ణాధ్వరికృతంఖండనాఖ్యసమాదితః
నివార్యసత్ప్రక్రియయాప్రభామండనమీర్యతే॥ ౪

బాదరాయణసిద్ధాంతో మగ్నో మతమహాంబుధౌ
అద్వైతానందతీర్థేనకరాత్పునరహోద్ధృతః॥ ౫

సుజనులారా- శ్రీమద్బాదరాయణమహర్షి ద్వాపరయుగము లో బ్రహ్మసూత్రములనురచియించివైదికాద్వైతసిద్ధాంతమును సరియైన న్యాయములతో నిరూపించియున్నారు. వాటిని మహర్షులంద రును తత్వంతు బాదరాయణాత్ - అని సన్మతించియున్నారు. వాటికి బోధాయనద్రమిడాచార్య ప్రభృతులగు పూర్వాచార్యులు సంక్షేప విస్తరవృత్తులచే సదర్థమును సర్వసంమతమగునటుల నిరూపించి యున్నారు.

తరువాత- శ్రీశంకరాచార్యులు పన్నెండుసంవత్సరముల వయ స్సులో సన్యసించి పదునెనిమిది సంవత్సరములవయస్సున పూర్వాచా ర్యులనందరిని పండితంమన్యులనియు ఔపనిషదంమన్యులనియు ఉపాస నాలుబ్ధులని నిర్నిమిత్తముగ దూషించి యీ బ్రహ్మసూత్రములకును కొన్ని యుపనిషత్తులకును భగవద్గీతలకును భాష్యములను రచియించి వాటిలో నొక నిర్గుణకూటస్థాచల బ్రహ్మమాత్రము సత్యమనియు మించినదంతయుననగా ఈశ్వరుడును జగత్తంతయును మిథ్యయని పూ ర్వపక్షభూత బాదర్యాషాగమముల మతానుసారముగ శ్రుతిస్మృతిసూ త్రములకు నసదర్థములు కల్పించి పూర్వగ్రంథములు ప్రచారము లోకి రాకుండునటుల జాగ్రతపరచి బాదరాయణవైదిక సిద్ధాంతమును మరుగుపరచి చాలాపరాక్రమించియున్నారు. శిష్యులను ప్రశిష్యులను ప్రోత్సాహపెట్టి తమభాష్యములకు స్వమతానుసారముగ సంక్షేప విస్తరవ్యాఖ్యలు చేయించియున్నారు. వారిపౌరుషమును పాండిత్య మును యసదృశమనియే చెప్పవలెను సంశయములేదు. వారు మన గురుపరంపరలో నారాధ్యులుగనున్నందున వారియెడల ద్వేష మెవ్వ రికి లేదనిగూడ రూఢిగా జెప్పవలసినదేగదా ఉత్తరకాలమందు వారు నిర్మించిన శివకేశవ త్రిపురసుందర్యాది బహుసగుణస్తోత్రములు వా రికి పరమేశ్వరునియెడగల భక్త్యతిశయమును ఆస్తికతను వెల్లడిజే యుటచే మనమందరము వారిని పూజింపుచున్నాము.

ఐనను- భాష్యత్రయములలో నేశసర్వజగన్మిథ్యాత్వమును వక్కా

ణించినకతమున నక్కాలపు పెద్దలు కొందరు మనస్సులలో క్షోభించియు మఱికొందరు గ్రంథమును వైశ్వానరప్రీతి జేసియు దాటిపోయిరి. ఇటీవల మఱికొందరు మహాజనము మనకీమతమే వద్దని యాసదర్థకలుషితమగు నుపనిషదర్థమునువదలి యోగమముల నాశ్రయించి శూన్యవాద ప్రసంజితమైనందున నద్వైతశబ్దమునుగూడ సహించక ద్వైతవిశిష్టాద్వైత శైవశాక్తవల్లభాది మతములనవలంబించిరి. పూర్వమందిన్నిమతములు లేవుగదా మనము శాంకరమతమున నవలంబించియున్నకతమున ప్రచ్ఛన్న బౌద్ధులుగా నెంచి మనముజూడ భుజింపరాదని వెరలుగూడ నేర్పరిచిరి నేటిదినమువరకును శాంకరమతఖండన పరములగు గ్రంథములను నిర్మించుచు నేయుండిరి. కొందరు చక్రాంకితులైయును మఱికొందరు లింగాంకితులైయును తొలగిపోవుచు నే యుండిరి.

భాష్యములలోను వ్యాఖ్యానములలోను ఈశ్వరుడు మిథ్యయని చెప్పినను అజ్ఞులకు కాముకులకే కర్మలనియు తత్వజ్ఞుడు కర్మలను కటాక్షముచేతనైన జూడడనియు పురాణాదులు ప్రశస్తములుగావని నిరసించుట తత్వమనియు ప్రాణాయామాదులచే జ్ఞానము కలుగనేరదనియు ఉపాసనలు ముముక్షువులకనావశ్యకములనియు వ్రాయబడినను మనము శ్రుతిస్మృతిపురాణాదులనే నమ్మి శ్రౌతస్మార్తకర్మలను సదాచారమును సగుణభక్తిమొదలగువాటి నవలంబించియుండుటచేతగదా నింతవరకును ఆస్తికులవలె గానవచ్చుచున్నారము. చాలువ్రాయనేల.

బాదరాయణుల మూలమతమనగా అనాదికాలమునుంచియద్వైత సిద్ధాంతములో కొన్నిశ్రుతులకాభాసార్థమును గ్రహించి కుతర్కప్రధానమై పూర్వపక్షరూపములైయున్నవాల శ్రీ వ్యాసులవారు సూత్రములచేతనే చూపియున్నారు. ఈకలికాలములో నాపూర్వపక్షమతములే శంకరాదులచే ప్రబలింపజేయబడినవి. యెట్లులనిన.

౧ నిర్గుణమునందు సగుణరూపమెట్లు గలిగినదనిన.

సూ—అనుస్మృతేర్బాదరిః - అనగా భక్తులాయారూపముల

గా స్మరించుటచే గలిగినది. జీవకల్పితమని బాదరిమతము యుక్త్యనుసారి ॥

సూ—సంపత్తేరితి జైమిని స్తథాహిదర్శయతి - అనగా శ్రుతి కల్పించితే గలిగినది. ప్రాదేశమాత్రమందు త్రైలోక్యశరీరమును శ్రుతి యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే అని జెప్పుచున్నదని జైమినిమతము శ్రుత్యనుసారి ఈ రెండును పూర్వపక్షములు.

సూ—ఆవస్థితేరితికాశకృత్స్నః అనగా పరమాత్మ సగుణనిర్గుణోభయరూపముగ నిత్యమైయున్నది. పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి - ఇత్యాదిశ్రుతులు పరమాత్మకురూపద్వయమును జెప్పుచున్నవని శ్రుతితాత్పర్యాభిజ్ఞుడగు కాశకృత్స్నాచార్యుల సిద్ధాంతమని సూత్రకర్త జెప్పియున్నాడు.

౨ ఉపాసకులుత్తరమార్గమున బొయ్యెడి లోకము కార్యబ్రహ్మలోకమా - కారణబ్రహ్మలోకమా యను విషయములో ॥

సూ—కార్యంబాదరిరస్యగత్యుపపత్తేః అనగా నుపాసకులందరును కార్యబ్రహ్మలోకముకే పోవుదురు. కార్యబ్రహ్మలోకము పరిచ్ఛిన్నముగాన గమనయుక్తముగదా పరిపూర్ణమగు కారణబ్రహ్మప్రాప్తికిగమన మేలనని బాదరిమతము యుక్త్యనుసారి పరబ్రహ్మనిర్గుణమేగాని సగుణములేదనియు సగుణముపాసనార్థము కల్పించబడినదిగాన మిథ్యయనియు సగుణములను చెప్పెడి శ్రుతులర్థవాదలనియు బ్రహ్మచర్యమునుండియే సన్యసించి నిర్వికల్పసమాధిచే నిర్గుణబ్రహ్మైక్యమునే విద్వాంసుడుజెందునని వీరియభిప్రాయము పూర్వపక్షభూతము.

సూ—పరంజైమినిర్ముఖ్యత్వాత్ ఇత్యాదిసూత్రములచేఉపాసకులందరు పరబ్రహ్మసంబంధియగు విద్యాప్రపంచమును అనగా విశ్వ

రూపము కే బోవుదురు. నపుంసకబ్రహ్మ శబ్దము కారణబ్రహ్మయందే ము
ఖ్యముగదా ఈ మొదలగు యుక్తులలో జైమినిమతము సగుణబ్రహ్మ
ప్రతిపాదకశ్రుతులు భూతార్థవాదములగుటచే స్వార్థమునందు ప్రమాణ
ములనియు ఉపాసనాశేషమైనమాత్రముచే సగుణము మిథ్యగాదని వీరి
యభిప్రాయము. శ్రుత్యనుసారి సిద్ధాంతైకదేశభూతము.

సూ— అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽ
దోషాత్తత్క్రతుశ్చేతి యని బాదరాయణనామాంకితమగు సిద్ధాంతసూత్ర
ము. దీనియర్థమేమనగా అప్రతీకాలంబనాన్ - అహంగ్రహోపాస
కులను విద్యుల్లోకమునుండి యమానవపురుషుడనగా పరమేశ్వరుడు
పరబ్రహ్మలోకమునకు అనగా విశ్వరూపమునకు తీసుకుపోవునని యు ప్రతీ
కోపాసకులను వరుణాదులు కార్యబ్రహ్మలోకమునకు దీసుకుబోవుదుర
నియు ఉత్తరమార్గగతులు రెండువిధములుగా వెళ్లుటలో తప్పుగాదని
యు తత్క్రతున్యాయమనగా పరమేశ్వరుని సాక్షాత్కరించిన యహం
గ్రహోపాసకులు పరమాత్మలోకమునకు బోవుదురు. నామాదిప్రతీ
కోపాసకులు కార్యబ్రహ్మలోకమునకు బోయి క్రమముక్తులగుదురని
యు బాదరాయణమహర్షి తననామమును జేర్చి వక్కాణించియు
న్నాడు. వీటితాత్పర్యము శంకాసమాధానములతో ప్రభలోను బ్ర
హ్మసూత్రతాత్పర్యదీపికలోను సవిస్తరముగా నిరూపించియున్నారము.
శాంకరభాష్యములో బాదరిమతమును సిద్ధాంతపరిచి బాదరాయణసి
ద్ధాంత ప్రతిపాదకసూత్రమును గంతవ్యం నిరూప్యగంత్యాన్ నిరూప
యతీయని యధికరణాంతరముగా విఘటన జేయబడినది.

### 3 - ముక్తుడు సగుణవైభవము ననుభవించునా లేక నిర్గుణమాత్రుడై బోవునా యను విషయములో

సూ - బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః - అనగ - ముక్తు
డు - సగుణవైభవమును - అనగా సత్యసంకల్పుడు సర్వజ్ఞుడునై
విద్యాప్రపంచములో యుగపత్సర్వకామావాప్తుడగునని - అందు
కు - ఉపన్యాసాదులు హేతువుగా జైమిని చెప్పుచున్నాడు - ఉప

న్యాసాదు లనగా నుపక్రమాదులు - శ్రుతి - య ఆత్మాఽపహతపా ప్మా సత్యకామస్సత్య సంకల్పః - అని సగుణబ్రహ్మ నుపక్రమించి - సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యః - అని విధించి - సనర్వాన్ లోకానా ప్నోతి సర్వాగ్ంశ్చ కామాన్ - అని ఫలమును జెప్పియున్నదని శ్రుత్య వష్టంభములో జైమిని మతము.

సూ—చితితన్మాత్రేణ తదాత్మకత్వాది త్యౌడులోమిః - అనగా చిన్మాత్రుడగు జీవుడు జలము జలములో గలసి నట్టుల చిన్మాత్రమగు బ్రహ్మలో గలసి పోవును వైభవ మేమాత్ర ముండదని యుక్త్యవష్టం భములో నౌడులోమిమతము. ఈనకు శౌచము సదాచారము సత్య వచనము, సన్న్యాసము, నక్కర లేదని యచల సిద్ధాంతము.

సూ—ఏవమప్యుపన్యాసా త్పూర్వభావా దవిరోధం బాదరా యణః - అని బాదరాయణ నామాంకితమగు సిద్ధాంత సూత్రము అనగా ఏవమప్యుపన్యాసాత్ - బ్రహ్మనిర్గుణము నిర్విశేషమని శ్రు తులు నిషేధముఖముగా జెప్పినను ల బ్రహ్మ, సత్యము, జ్ఞానము, ఆనం దము. సర్వజ్ఞము, సర్వశక్తి, సత్యకామము, సత్యసంకల్పమనియు శ్రుతులే విధిముఖముగా గూడ జెప్పుచున్నవిగాన తత్త్వజ్ఞానముచే నవి ద్యాతత్కార్యములు నివర్తించినను - పూర్వభావాత్ - అనగా ప్రథ మేక్షణ సిద్ధమగు విశ్వప్రపంచము సత్యమై యుండుటచేత - అవిరో ధం బాదరాయణః - అనగా వైభవసహితమగు సవిశేష ముక్తియు వైభవ రహితమగు నిర్విశేష విదేహముక్తియు రెండును గలుగ వచ్చును. విరోధము లేదని బాదరాయణ నామాంకిత సిద్ధాంత సూ త్రార్థము.

సూ—అభావం బాదరిరాహ హ్యేవం - ముక్తుడు వైభవాస క్తుడగు నెడ నిర్విశేషముక్తి లేకనే పోవును - స్త్రీభిర్వాయానైర్వా వయస్యైర్వా యనియు సర్వేషు లోకేషు కామచారో భవతి యని యు బహుదివ్యభోగములను జెప్పు శ్రుతు లర్థవాదలని బాదరి యా క్షేపము.

**సూ**—భావం జైమి నిర్వికల్పామననాత్ - అనగా స్త్రీభిర్వా యాన్తైర్వా యనియు - సయదిపితృలోక కామోభవతి - సయదిమాతృలోక కామోభవతి - యనియు మదివాక్యములతో శ్రుతులు వికల్పమును జెప్పుటచేత నొక కామము శమించి మరియొక్క కామముగలుగని సంధికాలములలో స్వరూపమాత్రనిర్విశేషస్థితి సంభవించవచ్చునని జైమిని సమాధానము శ్రుత్యనష్టంభమున జెప్పబడినది. భోగములపూర్వములుగ శ్రుతులచే జెప్పబడినందున యథార్థవాదలుగావని తాత్పర్యము.

**సూ**—ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోతః అని బాదరాయణనామాంకిత సిద్ధాంతసూత్రము అనగా అతః అవస్థితేరితికాశకృత్స్నః వికారావర్తి చ తథాహిస్థితిమాహ ఇత్యాదిసూత్రములు పాదోఽస్యవిశ్వాభూతానిత్యాది శ్రుతులును బ్రహ్మసవిశేషనిర్విశేషోభయరూపముగనున్నట్లుల జెప్పుచున్న విగాన మోక్షము ద్వాదశాహక్రతువువలె రెండువిధములు ద్వాదశాహక్రతువు అహీనరూపము సత్రరూపము రెండు తెరంగులైనట్లుల ముక్తి సవిశేష నిర్విశేషోభయ రూపముగా వచ్చునని జైమిని మతైక్యముతో బాదరాయణ సిద్ధాంతము.

శ్రుతిస్మృతిసూత్రములకిట్టి సదర్థమును జెప్పినను వినక సర్వమిథ్యాత్వమును జెప్పుటకు గల్పించిన యసదర్థములనే ప్రామాణికములని వాదించువారికి నారాయణస్మరణమే సమాధానము. పైజెప్పిన మతములలో శాంకరసిద్ధాంతము బాదరిమతమును అచలసిద్ధాంతమాడులోమిమతమును నిక్కలికాలానుసారముగ జెప్పుచున్నవి. బాదరాయణవైదిక సిద్ధాంతమాచార్యాదితమైనది ఇక్కాలమువరకును శాంకరమత సమ్మతిలేక నేగాదె మనవారిలోనుంచి కొందరు చక్రాంకితులైయును మరికొందరు లింగాంకితులైయును పోవుచుండిరి. శ్రుతిస్మృతులకు విరుద్ధార్థములజెప్పి కలుషపరుచుటచేత నేగదా వాటిని నివారించి సదర్థములను నిర్ణయించలేక నాగమముల నాశ్రయించిరి. శంకర నామ గలుగుటమాత్రముచే శంకరుడు కైలాసవాసుడు అందుచేత

వారుజెప్పిన యర్థములే సదర్థములని మనను నిర్బంధపెట్టిరి గాని అసలు కైలాసవాసిని మిథ్యయనువారికి శంకరుడును వారివాక్యములును ప్రమాణమని యెటుల సిద్ధించును.

శంకరుడు శంకరావతారమే ననువారు. శంకరునియందు నిరావరణజ్ఞానమున్నటుల జెప్పవలసినచో నజ్ఞానమును రాగద్వేషములను పారతంత్ర్యమునుజెప్పిరి. యెట్లులనిన.

౧ బాదరాయణులు వృద్ధబ్రాహ్మణరూపముతో వచ్చి భాష్యార్థమును నాలుగుమారులు చప్పరించి యంతర్ధానమైరని వారినిదెలియజాలక శంకరుండు కన్నులెఱ్ఱజేసిరనియు

౨ శంకరులు (శ్రీ) కాశీపట్టణమునకు విచ్చేసినప్పుడు విశ్వేశ్వరుడు చండాలరూపముతో దర్శనమిచ్చిరనియు వారిని తెలియజాలక దూరముగబ్రాహ్మని శంకరులనిరనియు విశ్వేశ్వరుడు వీరిజ్ఞానపరీక్షకై జేసిన ప్రశ్నలకు నేశంమయాకల్పితం అనగా నీశ్వరునిజగత్తును నేనేకల్పించివానని బాదరిమతానుసారముగ శంకరులు వికటముగ నుత్తరమిచ్చిరనియు.

౩ తామష్టాదశధాదృష్ట్వా చక్రే భాష్యత్రయం అని శంకరులు సూతసంహితను బహువారమాలోకించి భాష్యములనురచియించిరని పరతంత్రప్రజ్ఞతను ఇట్టియర్థములనే జెప్పిరి. సూతసంహితా ప్రారంభ మంగళశ్లోకమందును ఉత్తరగ్రంధమందును పరమాత్మకు కూటస్థనిర్విశేషరూపమొకటియు - అంబికాసహితముగ లీలావిగ్రహరూపమొకటియు విశ్వప్రపంచరూపమొకటియు నిటుల మూడురూపములు జెప్పబడినవి. వాటిలో నొకరూపమునయిన మిథ్యయని జెప్పలేదు. అందుకు విరుద్ధముగ భాష్యములో నిర్గుణనిర్విశేష రూపమొకటియే సత్యమనియు మిగిలిన రెండురూపములు మిథ్యయనియు జెప్పబడినది జూడుడి. అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం - ప్రభవంత్యుగ్రకర్మాణః క్ష యాయజగతో ఒహితాః-యజంతేనామయజ్ఞై స్తేదంభేనావిధిపూర్వకం-

నశౌచంనాపిచాచారో నసత్యంతేషు విద్యతే - ఇత్యాది శ్లోకములలో భగవంతుడు ౧౨,౧౬,౧౭,౧౮ అధ్యాయములలో అసురసంపత్తులని యు తామసులనియు బాదర్యాడులో మిమతానుసారులను దూషించి యున్నాడుశంకరవిజయాదులలోశంకరులుమండనముండనాధఞమైవిచ్చే సినప్పుడు. మండనగృహములో జైమినివ్యాసులు శ్రాద్ధభోక్తలుగానియ మితులై యుండిరన్నమాటను ఉత్తరకాలములో వ్యాసులవారు మర లవిచ్చేసి శంకరులతో చాలారోజులు ప్రసంగముజేసి కొంత ఆయుష్య మును బదులిచ్చిరన్నమాటను తమ వైదికసిద్ధాంతము నణగకొట్టి సర్వ మమిథ్యయను బాదర్యాడులో ములపూర్వపక్షౌధఞములను సిద్ధాంతప రచిన భాష్యములు మాయభిప్రాయానుసారమే యున్నవని వ్యాసుల వారు మెచ్చిరన్నమాటనున్నా దబ్బరయని యెవరునుజెప్పలేదు.

సన్యాసాశ్రమము శాస్త్రవిహితమైనను ఇంద్రియనిగ్రహములే ని మనుజులకీ కలికాలములో పనికిరాదని కల్యాదిలోనే మహాఋషులం దరును అశ్వాలంబంగవాలంబం సన్యాసం పలపైతృకం దేవరాచ్చసు తోత్పత్తిః కలౌపంచవిసర్జయేత్ అని నిషేధించిరి. మరికొందరు మ హాఋషులు వేదప్రచారము వర్ణాశ్రమవిభాగమున్నంతవరకు వైరా గ్యభాగ్యముండి యుక్తకాలములో సన్యసించి దానిలాభమును సత్పు రుషులు లభించకుండ మనమేల నడ్డుపరచవలెనని యోచించి సన్యాస మును త్రేతాగ్నిపరిగ్రహముకును ప్రతిప్రసవమనగ తిరిగి యనుజ్ఞని చ్చిరి. అగ్నిహోత్రంచ సన్యాసంకలౌతావద్య విష్యతః అని ప్రతిప్ర సవశాస్త్రము. ఇట్టిస్థితిలో వాదజితుడగు మండనునకు అతనికి వైరా గ్యము లేకపోయినను సన్యాసమును కోరకపోయినను అతనిభార్య మొరబెట్టుచు వెనుతగిలినను బలాత్కారముగ సన్యాసమిచ్చుటయు మ నకందరికినిబ్రహ్మచర్యమునుండి సన్యసించినవారికేమోక్షమని బోధించు టయు మంచి బోధకాదా. భగవద్గీతలలో మట్టుకు కామ్యానాం కర్మ ణాం న్యాసంసన్యాసంకవయోవిదురిత్యాది గ్రంథములో ౧౮ అధ్యా యమందు బాహ్యసన్యాసమును ప్రశస్తిగా జెప్పలేదు. రాగద్వేషా పాదకమగు నీ ప్రశంసలనటులుండనిమ్ము. రామకృష్ణయజ్వశాస్త్రిగా

రు మా ప్రభయను గ్రంథమును పరిమితమైయున్నదని సంవత్సరకాల ము బహు ప్రయత్నము జేసి ఖండన జేసితిమని భ్రమభంజనియను పేరు తో ముద్రించి ప్రచురపరిచిరి. అందులో జగద్గురుశంకరభక్త్యున్మూలక మగునటుల దోషాభాసములు వ్రాయబడినవనియు క్రొత్తగా నొకసి ద్ధాంతమును మేము కల్పించితిమనే మొదలగు సంగతులు వ్రాసిరి. తమరును తమశంకరులును ఈశ్వరభక్త్యున్మూలన మగునటుల నీశ్వరు డు మిథ్యయని వ్రాసినంత వ్రాయలేదుగదా. తమశంకరులు పూర్వా చార్యులను నిర్నిమిత్తముగ దూషించినంతగానితాము అనవసరములో జైమినికపిలకణాదరామానుజజైనాదులను దూషించినంతగాని దూషిం పలేదుగదా ఉన్న సంగతులనే వ్రాసితిమి.

రెండువేల సంవత్సరములక్రింద జగత్తులో తత్వమార్గము మునిగిపోయి జైనబౌద్ధమీమాంసకాది భేదవాదిమతములతో వ్యాపిం చినదనియు అట్టిమతములను శంకరులున్మూలనము జేసిరనియు బహ్వా ర్భాటముతో వ్రాసినమాటలు డబ్బరగదా యేలననగ తత్వమార్గ మును పోషించుటకు శ్రుతిస్మృతిపురాణాదులును ఇప్పటికిన్ని నధికు లైనపండితులును గలిగేయున్నారు. జైనబౌద్ధాదిమత ములింతవరకు దినదినప్రవృద్ధములై యుండనేయున్నవి. ఉత్తరకాలమందు భేదవాది మతములు క్రొత్తగా చాల్పుబయలు వెళ్లియున్నవిగదా అదటులనుం డనిమ్ము.

వ్యాజశాస్త్రిగారు- ఖండననామక గ్రంథారంభములో సం స్కృతభాషతో ఇహాఖలు సత్యంజ్ఞానమనంతం బ్రహ్మేత్యాది శ్రుతిశత ప్రకాశిత మద్వితీయం బ్రహ్మ నాది నిధనమానందఘనం ముక్తప్రా ప్యం విరాజతే తదేవానాది మూలప్రకృత్య వచ్ఛిన్నం సవిశేషం బ్రహ్మేతిగీయతే ఇత్యాదిప్రశంసలు వ్రాసిరి. ఈఅనాదిమూల ప్రకృ త్యవచ్ఛిన్నము ప్రథమమందు ముక్తప్రాప్యం బ్రహ్మవిరాజతే అనిన బ్రహ్మకంటె భిన్నమా ఏకదేశమా మూలప్రకృతి అనాదిగానున్న వుడు దానితో అనవచ్ఛిన్నము అనగా అసంబద్ధ బ్రహ్మవేరుగా నెట్లు సిద్ధిం

చును. ఇట్టిసవిశేషమును మిథ్యయనియు ముక్తప్రాప్యముగాదనియు జెప్పుచున్నారుగదా ఇదియెటులసంభవించునో విచారించుడి.

సూ- ఆనందాదయః ప్రధానస్య. అనుసూత్రప్రకారము ఆనందాదిధర్మములతో విధిముఖముగా జెప్పబడిన బ్రహ్మ ప్రధానస్య అనగా జగత్కారణస్య అనియర్థముగాన సదిసవిశేషమేగదా.

సూ- అక్షరధియాంత్వవరోధస్సామాన్యతద్భావాభ్యామిత్యాది సూత్రప్రకారము అద్రేశ్యమగ్రాహ్యమస్థూలమనణ్విత్యాది నిషేధముఖ ప్రతిపాదితమే నిర్విశేషబ్రహ్మగదా అది నతదశ్నాతికించన నతదశ్నాతి కచ్చన నసత్తన్నాసదుచ్యతేయని శ్రుతిస్మృతులప్రకారము సదసదాదిశబ్దప్రతిపాద్యమేగానప్పు డుజ్ఞేయమెట్లులగును. తదేవానాది మూలప్రకృత్యవచ్ఛిన్నం అన్నందున అనాదినుంచి మూలప్రకృతితోగూడి యున్నసవిశేషమేయాయెను.

మూలప్రకృతి బ్రహ్మకంటె భిన్నమా? యభిన్నమా? చేతనమా జడమా సత్యమా? మిథ్యాభూతమా.

సత్యము భిన్నము యనిన ద్వైతాపత్తి అభిన్నమనిన బ్రహ్మ యనక నామాంతర మెందుకు అభిన్నమై జడమనిన బ్రహ్మకె జడత్వము ప్రాపించును - శుద్ధం బుద్ధం ముక్తమిత్యాది శ్రుతి విరోధము చిదభిన్నము జడమను టవ్యాహతము అభిన్నమై యనృతమనిన బ్రహ్మకే యనృతత్వము ప్రాపించును గాన యనాదిమూల ప్రకృతియనగ స్వభావోఽధ్యాత్మముచ్యతే భూతభావోద్భవకరః - యని భగవంతుడు చెప్పిన ప్రకారముగా నిఖిల చరాచర విద్యాప్రపంచ రూపముగ విలసింపజేయు పరమాత్మ స్వభావమని జెప్పవలసె చిదాత్మయొక్క స్వభావము విమర్శ శబ్దితమగు ప్రమారూప ప్రత్యక్షమేగదా చిచ్ఛక్తిశ్చేతనారూపాయని జెప్పియున్నది. అది భ్రమరూపము గాదు. పరమాత్మకు అవిద్యా భ్రమలు లేవుగదా పరమాత్మనుంచి యనాది స్వీయప్రకృతిచే నీక్షణ కామనాది పూర్వకముగా నిర్మించబడిన యా

కాశాద్య పంచీకృత భూత భౌతిక ప్రపంచమును ఏకపాద్విభూతిగాన విసర్గః కర్మసంజ్ఞితః - యని భగవంతుడు జెప్పిన రీతుగా సత్యమనే జెప్పవలెను - ఏతత్సత్యం బ్రహ్మపురం - తఇమేసత్యాః కామాః అని శ్రుతులు జెప్పుచున్నవి - తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్ - అనేనజీవేనాత్మనానుప్రవిశ్యఇత్యాది శ్రుతుల ప్రకారము పరమాత్మ ప్రతిబింబ రూపులగు సమష్టివ్యష్టి జీవవర్గముగూడ సత్యమేగదా ఈతీరుగా ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా యను శ్రుతి ప్రకారము స్రష్టయగు పరమేశ్వరుడును సృష్టమైన యాపంచీకృత ప్రపంచమును ప్రతిబింబరూపులగు జీవసంఘమును చిదేకరసములుగాన విద్యాప్రపంచమని జెప్పబడును ఈసర్వము వేద్యమనిభగవంతుడు - సాధిభూతాధిదైవం మాంసాధ యజ్ఞంచయే విదుః అని జెప్పియున్నాడు. ఇందులో యేది మిథ్యాయనవచ్చునో చూడుడి. వాసిష్ఠములో- చిద్భాత్యేవహిసర్గా దాకచంతీ భాతసర్గవత్- భాసనీయంచ భాసంచరూపం యత్రస్వయంప్రభా - అనగా సృష్టికాలములో బ్రహ్మసృష్టివలె భాసించినది అందులో భాసకుడును, భాసమును, భాసనీయమును, మూడు స్వయంప్రభా స్వప్రకాశములు శ్లో॥ దేశకాల క్రియాలోక రూపచిత్తాత్మ సత్పదం - దేశకాలాది శబ్దార్థరహితం నచశూన్యకం - సత్పదం - పరమాత్మ పదము - దేశకాల క్రియాలోకరూప చిత్తాత్మ- ఇన్నిటి రూపమై సర్వాత్మకమై యున్నదిగాని - దేశకాలాది శబ్దార్థ రహితం- అవిద్యకజడ దేశకాలాది శబ్దములతోను వాటి యర్థములతోను రహితమై యున్నది - నచశూన్యకం - దేశకాలాది శూన్యమైనదును కాదని - శ్లో॥ అనాద్యంతావ భాసాత్మాబోధ ఆత్మనిసంస్థితః - నానాపదార్థ రూపేణ కమూర్త్యాదితయాయథా - ఆద్యంతములు లేని స్వప్రకాశ పరమాత్మతనలో నానాపదార్థ రూపముగా జలము తరంగాది రూపమైయున్నటుల నున్నదని యర్థము. శ్లో॥ సత్తాతివాహికో దేహ స్తత్పరం పరమార్థతః - ప్రత్యక్షం పరమంయత్తత్తదాద్యం కచనంచితః - పరమాత్మసత్తయేయాతి వాహికదేహము అది పారమార్థికసత్యమైయున్నది. పరమాత్మయొక్క సృష్ట్యాది

కచనమే ప్రమారూపమైన ప్రత్యక్షము అందులో భాసించిన ప్రపంచ మంతయు పరమార్థసత్యమని యర్థము. శ్లో. బోధస్యాంతరిదం విశ్వం స్థితమేవరఘూద్వహ - స్తంభస్యాంతర్యథా శాలభంజికా ప్రకటీకృతా యనగా స్తంభములో చరాచరప్రతిమలు జెక్కబడినటుల బోధరూప మగు పరమాత్మగర్భములో ఈ ప్రపంచమంతయు చిన్మయమై యెల్ల ప్పుడు నుండ సేయున్నదని యర్థము. ఇత్యాద్యుపబృంహణములచేత మూలప్రకృతి కార్యప్రకృతులకు పరమార్థసత్యత్వము చిన్మయత్వ ము బ్రహ్మాభిన్నత్వము రూఢమగుచున్నయది. శాస్త్రియజ్వగారు విద్యా విద్యాప్రపంచభేదమును మేము క్రొత్తగా కల్పించినటుల తుస్కరిం చిరి. ప్రపంచోద్వివిధః విద్యాప్రపంచశ్చా విద్యాప్రపంచశ్చేతి యని విభాగము మహానారాయణాద్యుపనిషత్తులలో జెప్పబడియున్నది. క్రొత్తగా మేము కల్పించలేదు వాటినిజూడక యజ్వశాస్త్రిగారు తు స్కరించుట జబ్బుమాటగాదా. విద్యాప్రపంచములోన భేదము తాత్వి కము భేదము బహుస్యాం అనిపరమాత్మచే కల్పితము అభ్రాంతచేతన కల్పితమగుటచే మిథ్యగాదు.

ఇచ్చట శాస్త్రవ్యవస్థయెటులనగా.

కార్యకారణములు భిన్నములని తార్కికులు జెప్పెదరు. అభి న్నములని సాంఖ్యులుజెప్పుచున్నారు. కార్యము కారణవ్యతిరేకము గా అసత్ అందుచేత కారణము సత్యము కార్యముమిథ్యయని సిద్ధాం తైకదేశులగు బాదర్యాదులోములు జెప్పుచున్నారు. ముఖ్యసిద్ధాంత మేమనగా కార్యమీశసృష్టము జీవసృష్టమని రెండువిధములు. ఈక్షణా దిప్రవేశాంత మీశసృష్టము జాగ్రదాది విమోక్షాంతము జీవసృష్టము ఈశసృష్టము చిన్మయము పరమార్థసత్యము పరమాత్మాభిన్నము విద్యాప్రపంచమని జెప్పబడును. జీవావిద్యాకల్పితప్రపంచము ప్రతిజీ వునకు భిన్నము భ్రాంతిజన్యముగాన మిథ్యయనబడును. యిదియేజడ దుఃఖాదిరూపమైయుండును. తత్వజ్ఞానముచే నివర్తించును. విద్యాప్ర పంచము కాలత్రయమందును కారణాభిన్నమై యున్నది. ఇదియేసత్కా

ర్థ్యవాదము. అవిద్యాప్రపంచము త్రైకాలిక నిషేధప్రతియోగి నాసీద
స్తిభవిష్యతియని జెప్పబడును. ఇట్టి విద్యావిద్యాప్రపంచవిభాగముతో
బాదరాయణాద్వైదికాద్వైతసిద్ధాంతము.

మన భాష్య కర్తయును వ్యాఖ్యాతలును బాదర్యాదులోము
ల పూర్వపక్షిప్రక్రియలనే వ్యుత్పాదన జేసిరి గాని బాదరాయణ సిద్ధాం
తమును జూపరైరి. మేము సూత్ర తాత్పర్యదీపికలోను ప్రభ ను గీ
తా తాత్పర్యదీపికలోను ఈ విభాగమును వివరించితిగాని మన పండి
తులు జూడరు మనస్కరించరు అందుకు నారాయణ స్మరణమే జేయ
వలసె

కన్నులు గానరాని యీముసలితనములో మేము వ్యాసప్రసా
దమువల్ల లోకోపకారకమై పరమేశ్వర ప్రేరేపణ గలిగి ఈ గ్రంథ
ములు వ్రాసితిమనిన ననూయపడిరి.

బాదరాయణ వైదిక సిద్ధాంతము నణగకొట్టి బాదర్యాదులో
ముల పూర్వపక్షిప్రక్రియలచే రచియించిన సర్వము మిథ్యయని
వ్రాసిన భాష్యమును బాదరాయణుల వారు మూడు నాలుగు మారు
లు చప్పరించి యంతర్ధానమైన సంగతిని ప్రక్కకివేసి వ్యాసులవారు
శంకరులకు ప్రసన్గించి సంతసించి భాష్యము మా తాత్పర్య ప్రకార
మే రచియింపబడినదని మెచ్చి యాయుష్యమును బదులిచ్చిరన్న శంక
రవిజయాదులలో వ్రాసిన మాటలను నమ్మినగదా వ్యాసులవారు ప్ర
సంగములో నోడిపోయిరని మేము వ్రాసితే నమ్మి సంతసించుదురని ద
లంచెదను పెయ్యేల అది యటుల నుండనిమ్ము యజ్ఞశాస్త్రిగారు
యనాదిమూలప్రకృతిగత శుద్ధసత్వావచ్ఛిన్నం బ్రహ్మ - ఈశ్వరుడన్న
ది నిజమేగాని యది మిథ్యయనియు ముముక్షువులు పాసించవలెననియు
ఈశ్వరమిథ్యాత్వము శాస్త్రయుక్తులచే సిద్ధియించబడినదని వ్రాసిన
మాట సరికాదు.

మిథ్యావస్తువు ఉపాస్యమగునా అందువల్ల ఫలముండునా - వు

రుపాయ శాశ్వతే - ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగ లం - తదేతత్సత్యం - యథాసుదీప్తాత్పావకాత్ - ఏతత్సత్యం బ్రహ్మపురం - తఇమేసత్యాః కామాః - త్రీణిరూపాణీత్యేవసత్యం - ఇత్యాదిశ్రుతులు ఈశ్వరుని తత్సృష్టమగు ప్రపంచమును సత్యమని బహుగాను ఘోషింపుచున్నవి.

వాటికి అక్షయ్యగ్ంహవై చాతుర్మాస్యయాజినస్సుకృతం భవతి యని కర్మఫలప్రతి పాదకపరిమితాత్మ యత్వమును జెప్పెడి శ్రుతినిదృష్టాంతమిచ్చి యజ్వశాస్త్రిగారు ఈశ్వరుని తత్సృష్టప్రపంచమును మిథ్యయనుట భ్రమగాదా ఔపాధికత్వాత్ మిథ్యా అనగాను పాధివల్లవచ్చినది మిథ్యయను యుక్తిసత్యమగునా పసుపులో సున్నముకలిసితే వచ్చిన యెరుపు మిథ్యయగునా పసుపులో సమమయిన సత్యముకాలేదా ఘటాకాశము మిథ్యమైనదా మహాకాశములో సమసత్తాకముగా లేదా ఔపాధికముమిథ్య దృశ్యముమిథ్య పరిచ్ఛిన్నముమిథ్య ఇత్యాది యుక్తులు మిథ్యాత్వమును సాధింపజాలవు. భ్రమయేల భ్రాంతివల్ల గలిగినదియు తత్త్వజ్ఞానముచేత బాధితమైనదియు మిథ్యయగును. పరమేశ్వరునకవిద్యాభ్రాంతులు లేవు. తత్సృష్టవిద్యాప్రపంచము తత్త్వజ్ఞానముచే బాధితముగాబోదుగాన పరమార్థసత్యమనే జెప్పవలెను. ఈశ్వరుడు పరమార్థసత్యమని జెప్పనేపనిలేదు. సుషుప్తివిదేహముక్తులలో ప్రమాతలీనమైనందున ప్రపంచము భాసించకపోయినను అన్యజీవులకు భాసింపుచు సత్యమై యుండనేయున్నది. అందుచేత విద్వద్యజ్వగారు నేశ్వరసర్వజగన్మిథ్యాత్వము శాస్త్రయుక్తులవల్ల సిద్ధమైయున్నదనినమాట భ్రమమాత్రేను మాలినసత్వప్రధానా విద్యావచ్ఛిన్నం జీవ ఏవావతిష్ఠతే అని వ్రాసినదిగూడ భ్రమరూపమే యెందువల్లననగా మలినసత్వప్రతిబింబితుడు బద్ధజీవుడు శుద్ధసత్వప్రతిబింబితుడు ముక్తజీవుడు ఉభయత్రఅవచ్ఛిన్నుడు పరమేశ్వరుడేగాని జీవుడుగాడు. అవికృతబింబరూపుడేగదా ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతియని జెప్పబడియున్నాడు. మలిసత్వప్రతిఫలితులకు బ్రహ్మభేదము విస్మృతమై జీవభావముదోచి యవిద్యచేత ప్రత్యేకము సమష్టిలోను వ్యష్టిలో

ను మిథ్యాభూతమగు శరీరత్రయమధ్యస్థమై సంసృతిగలుగును వారికే వివేక జ్ఞానముచేత సత్వము శుద్ధమైనకొలది వారిశరీరత్రయము బాధితమగుచు భూమికాక్రమమున నివర్తించును. భూమికాక్రమముగానే బ్రహ్మభేదము స్ఫురితికిరాబడును. ఈశరీరములే క్షేత్రములని జెప్పబడినవి. మహాభూతాన్యహంకారోబుద్ధిరవ్యక్తమేవచ ఇంద్రియాణిదశైకంచపంచచేంద్రియగోచరాః- ఇచ్ఛాద్వేషస్సుఖందుఃఖం సంఘాతశ్చేతనాధృతిః ఏతత్ క్షేత్రం సమాసేనయని భగవంతుడు జెప్పియున్నాడు ఇవి అవ్యక్తములో బుట్టి అవ్యక్తములోనేయుండి యవ్యక్తములో నలయించుచున్నవిగాన నివి మిథ్యయగును మహాభూతములు పంచీకృతములు అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే - రాత్ర్యాగమే ప్రలీయంతేతత్రైవావ్యక్తసంజ్ఞకేయనిగీతావచనము - అపంచీకృతభూతాభౌతిక ప్రపంచమీక్షణకామవాది పూర్వకముగా పరమేశ్వర సాక్షాత్సృష్టముగాన సర్వదాసత్యమేగాబడును. శ్రు - సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠాః అని శ్రుతిజెప్పుచున్నది. సర్వమిథ్యాత్వవాదులు విశిష్టమని ఉపహితమని ఉపలక్షితమని వికల్పించి వాటిలోను పలక్షితమొకటి సత్యమునియు తక్కినరెండు మిథ్యయని జెప్పియున్నారుగాని ఉపహితమైన ఘటాకాశమును విశిష్టమైన ఘటమును మిథ్యగాలేదుగాన భ్రమమాత్రము.

యజ్వశాస్త్రిగారు ఈశ్వర మిథ్యాత్వము శాస్త్రయుక్తులచే సిద్ధమైనను యపరోక్ష నిశ్చయము లేదు గాన యపరోక్షజ్ఞాన పర్యంతము గురుదేవతోపాసన మవశ్యానుష్ఠేయమనియు పూర్వులైన సనకాదులును ఆర్వాచీనులగు నారాయణ తీర్థాదులును భక్తి జేసినారని వ్రాసిన మాట యెంతపిచ్చిమాటయో నాలోచించుడి సనకాదులీశ్వరుని మిథ్యగాదెలసి భక్తి జేసినట్లు తమకెటుల దెలసె ఈశ్వరుడును తత్సృష్ట విద్యాప్రపంచము పరమార్థసత్యమని శాస్త్రమును యుక్తులను జూపితిమిగదా - అవ్యక్తాత్తుపరః పురుషః నారాయణః పరోఽవ్యక్తాత్ - ఇత్యాది శ్రుతిస్మృతులలో అవ్యక్తముకంటె పరము నిర్విశేషమే ననియు సవిశేషమన్నందుకు తద్వాచకపదమే లేదని

పురుషనారాయణశబ్దములు నిర్విశేషమునే జెప్పుచున్నవని వ్రాసిన మాటకూడ భ్రాంతిమాత్రమే - సహస్రశీర్షాపురుషః - అథపురుషో హవై నారాయణోఽకామయతఇత్యాది శ్రుతులు జగత్కారణము గు సవిశేషమునే జెప్పుచున్నవిగదా

ఏకదేశసమావిష్ట నానారత్న ప్రభావత్ - అని మాప్రభలో నివ్వబడిన దృష్టాంతము. విద్యాప్రపంచములో లోహిత శుక్ల కృష్ణాది రూపములగు తేజఆదులు నానారత్నప్రభలేక తేజోరూపము లైనటుల చిదేకరసములని మననోపయోగములై దృష్టాంత మివ్వబడినవి.

ఆదిత్యవర్ణం అను శ్రుతి శుద్ధసత్త్వోపహితమగు పరమాత్మ యాదిత్యునివలె చిన్మయజ్యోతీరూపమై భాసించునని జెప్పుచున్నది గాని జడజ్యోతిస్సును శుద్ధనిర్విశేష జ్ఞప్తిని జెప్పలేదు దివిసూర్యసహస్రస్యభవేద్యుగపదుత్థితా - యదిభాస్సదృశీసాస్యాద్భాసస్తస్యమహాత్మనః - యదాదిత్యగతం తేజోజగద్భాసయతేఽఖిలం - యచ్చంద్రమసి యచ్చాగ్నౌతత్తేజో విద్ధిమామకంఇత్యాది స్మృతులు పరమాత్మ ప్రకృతిలో జేరిన యపంచీకృత తేజస్సునే జెప్పుచున్నవి భ్రమయేల

సవిశేషబ్రహ్మజ్ఞానము జీవన్ముక్తిఫలకముగాదనియు విశేషము నశించితే విశిష్టమును ఉపాధినశించితే ఉపహితమును నశించునుగాన మిథ్యయని సర్వమిథ్యాత్వవాదులు చెప్పిన మాటలు భ్రమమాత్రము దృష్టమాత్రేణ మోక్షద యని శ్రుతియు యస్యస్మరణమాత్రేణ జన్మసంసార బంధనాత్ విముచ్యతే ఇత్యాది స్మృతులును సవిశేషజ్ఞానముచేతనే ముక్తిని జెప్పుచున్నవి. ఘటము నశించితే ఘటాకాశము నశించలేదు రూపము మారితే ఘటము నశించలేదు నశించినదనిత్యముగుగాని యసత్యముగాబోదు.

నిర్గుణబ్రహ్మజ్ఞానమువల్లనే మోక్షమనియు సగుణముపాస్యమేగాని జ్ఞేయముగాదనియు ఉపాసనాశేషమైనందున మిథ్యయనియుమనవారు జెప్పుటవి పరితబోధయనవలెను నిర్గుణము జ్ఞేయమేలాగు - శ్రు - సపురుషోనామ రూపజ్ఞానాగోచరం సంసారిణామతి దుర్విజ్ఞే

యం విషయం విహాయఅనిముద్గలోపనిషత్తులో నిర్విశేషము దేవతలకు ఋషులకుగూడ దుర్విజ్ఞేయమని జెప్పియున్నది నతదశ్నాతికశ్చన యని బృహదారణ్య శ్రుతి జెప్పుచున్నది నసత్తన్నాసదుచ్యతేయని భగవద్వచనముగాన నిర్విశేషము - అక్షరధియాం త్వవరోధఇత్యాది న్యాయసూత్ర ప్రకారము అద్రేశ్యమగ్రాహ్య మస్థూలమనణ్విత్యాది నిషేధ ముఖధర్మములతోను పాస్యమేగాని జ్ఞేయమెప్పుడును గాదు అజ్ఞాతమునైన పరోక్షనిశ్చయముతోను పాసించవచ్చును గదా సవిశేషము పైజెప్పిన ప్రకారము జ్ఞేయమును ఉపాస్యముఉభయమును గావచ్చును.

విద్వద్వ్యజ్వగారు అవ్యక్తముకంటె పరమునిర్విశేషమేననియు అవ్యక్తోపాధికము సవిశేషమేనని సిద్ధాంతమని వ్రాసిగాని యవ్యక్తశబ్దముచే దేనినుల్లేఖించిరో దెలియదు.

శ్రు—సచ్ఛబ్దవాచ్యమవిద్యాశబలంబ్రహ్మ - బ్రహ్మణోఽవ్యక్తంఅని శ్రుతిప్రకారము సచ్ఛబ్దవాచ్యమ విద్యాశబలమని జెప్పిన బ్రహ్మయవిద్యాశబలమగుటచే సవిశేషమేగదా సవిశేషమువల్ల నవ్యక్తము బుట్టినప్పుడు అవ్యక్తముకంటె సవిశేషము పరమైగాలేదా సూత్రకర్త తదవ్యక్తమాహహి అను సూత్రములో జీవులకు అవిద్యాధ్యస్తమగు భూతసూక్ష్మము అనగా కారణశరీరముఅతిసూక్ష్మమగుటచే నవ్యక్తమనియు అది జీవులదృష్టి కడ్డువచ్చుటచేయ నభివ్యక్తమగు విద్యాప్రపంచ మవ్యక్తమైనదనియు అనగా నావృతమైన దనియు అపిసంరాధనే ప్రత్యక్షాను మానాభ్యాంఅను సూత్రములో సాధకులకు ధ్యానకాలములో అవ్యక్తమైన విద్యాప్రపంచము వ్యక్తమై సాక్షాత్కరించబడుననియు జెప్పియున్నారు

సచ్ఛబ్దవాచ్యమవిద్యాశ బలంబ్రహ్మ - యను శ్రుతిలో బ్రహ్మశబ్దము సమిష్టిజీవవాచకము బ్రహ్మవాచకమేగాదు బ్రహ్మ యెప్పుడు నవిద్యాశబలముగాడు గదా- తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచజాయతే అను శ్రుతిలో బ్రహ్మశబ్దము కార్యబ్రహ్మ పరముగాదా

అదే ప్రకారమవ్యక్తమహదాది కారణబ్రహ్మ సమష్టిజీవుడేగాని పర బ్రహ్మగాడు సమష్టిజీవున కజ్ఞాతమై యవిద్యావృతమైనపరబ్రహ్మ నిర్విశేషమెగాదు మరేమన సాధిభూతము సాధిదైవము సాధియజ్ఞమునైన విద్యాప్రపంచమే సర్వాత్మకము అదియే వేద్యమని భగవంతుడు జెప్పి యున్నాడు. భ్రమయేల? విద్వద్వ్యజ్వగారు - అత్రేదంవిచార్యతే - కిం నిర్విశేషం సత్యచిద్ఘనం బ్రహ్మం గీకృత్యైతస్యైవ సవిశేషరూపం పరమార్థ సత్యమిత్యం గీక్రియతే - అనగా నిర్విశేషము నంగీకరించి దానికే సవిశేషరూపముకూడ పరమార్థ సత్యమని మాప్రభలో జెప్పితిమా లేక ప్రకారాంతరమా యని చాలా వికల్పన ప్రాగల్భ్యము ను బూని యొకవస్తువుకు సవిశేష నిర్విశేషోభయ రూపము సమసత్తాకమై యుండదని జెప్పిరి వారి తాత్పర్యము నిర్విశేషము సత్యమనియు సవిశేషము మిథ్యయని గదా సిద్ధాంతమటుగాదు - శ్రు - పాదోఽస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివియని శ్రుతి - అవస్థితే రితి కాశకృత్స్నః - వికారావర్తి చతథాహిస్థితిమాహ - ఇత్యాది సూత్రములును బ్రహ్మ సవిశేష నిర్విశేషోభయ రూపముగ పరమార్థ సత్యమై యున్నటుల జెప్పుచున్నవి - ద్విరూపంహి బ్రహ్మవిభాతి - నిరాకారం క్వాపిక్వచిదపిచ సాకారమ మలం అని భాష్యకర్తగూడ జెప్పియున్నాడు.

విద్వద్వ్యజ్వగారు సవిశేషబ్రహ్మను సర్వప్రపంచమును మిథ్య యని జెప్పుటకు సర్వత్ర నొకటే బాధాసామానాధికరణ్యమును జెప్పి కొన్ని వాసిష శ్లోకములను సూతసంహితా వచనములను శివగీతాశ్లోకముల నుదాహరించిరి వాటి సదర్థము నీక్రింద వివరించెదము

వాసిష్ఠే - పరమేష్ఠ్యపి నిష్ఠావాన్ హ్రీయతే హరి రప్యజః - భవోప్య భావమాయతికై వాస్థామాద్య శేజనే - బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ సర్వావాభూతజాతయః - నాశమే వానుధావంతి సలిలానీవబాడబం - ఇత్యాది శ్లోకముల నుదహరించి బ్రహ్మ విష్ణ్వాది సహితముగు నిఖిలప్రపంచము మిథ్యయనియె ఇట్టి శ్లోకములను జూచియే నల్పప్రజ్ఞుల

గు బాదర్యాకులోములు గూడ మిథ్యాత్వమును నిశ్చయించి దానిని యుక్త్యాభాసలతో దృఢపరిచి యున్నారు గదా ఈ శ్లోకములు అవిద్యాప్రపంచములో సర్వము మిధ్యయని జెప్పుచున్నది. స్వప్న ప్రపంచములో భాసించిన సర్వము మిధ్యయైనటుల నవిద్యాప్రపంచములో భాసించినవి గూడ మిధ్యయగును - త్రయఆవసథాస్త్రయస్స్వప్నాః యని శ్రుతి జెప్పుచున్నది వాసిష్ఠము నే యాదృక్స్యాదజ్ఞ విషయం జగత్తస్యనసత్యతా - యాదృక్సతజ్ఞ విషయంతదనాఖ్యం యదద్వయం అనగా తత్వజ్ఞగమ్యమైన విద్యా ప్రపంచమనాఖ్యమైన యద్వయబ్రహ్మయె చిదానందైక రసమని తాత్పర్యము

శ్లో॥ ఆద్యంతద్వైత మజ్ఞానాంత జ్ఞానాంతన్నవిద్యతే - బ్రహ్మదయోఽజ్ఞ విదితానచనామసంతి- ఇత్యాదిగ్రంథములో - స్వప్నతుల్యమైన యవిద్యా ప్రపంచములో పలిబ్రహ్మాదులును ప్రపంచమునుమిధ్యయగుగాని తత్వజ్ఞవిదితమగు విద్యాప్రపంచమంతయు అనగా సాధిభూతము సాధిదైవము సాధియజ్ఞము ఈసర్వము పరమార్థసత్యమని జెప్పబడియున్నది. అతిగంభీరముగదా వాసిష్ఠతాత్పర్యము. సర్వాత్మకంచతత్ స్థానం అని పరమాత్మపదము సర్వాత్మకమై యున్నదని జెప్పుచున్నది. వ్యర్థా నేపిశ్వరూపాఖ్యం అన్యత్రబ్రహ్మసంజ్ఞితం అని ముక్తునకు శుద్ధసత్వవికాస కాలములో విశ్వరూపవిహారమును అన్యత్ర అనగా శుద్ధసత్వములీనమైన విదేహము క్తిలో నిర్విశేషబ్రహ్మరూపుడై యుండునని చెప్పుచున్నది.

సూతసంహితా వాక్యములు—— కారణాత్కార్య జాతస్యభేదాభావాచ్చవస్తుతః అని పూర్వార్థములో విద్యాప్రపంచములో కార్యకారణములకు భేదములేదని యభేదసామానాధికరణ్యము జెప్పబడినది. వస్తుతఃయను పదస్వారస్యముచే నీ యర్థమును జెప్పవలసె కార్యకారణభేదశ్చ కారకవ్యాపృతిస్తథా ఉత్పత్తిశ్చ వినాశశ్చతథైవార్థక్రియాపిచ-నామరూపవిశేషశ్చసర్వం భ్రాంత్యాప్రసిధ్యతియని ఉత్తర వాక్యములలో అవిద్యాప్రపంచముకు మిధ్యాత్వము జెప్పబడినది.

ప్రాతీతికేనరూపేణావికారోఽ సత్యఏవహి యని అవిద్యాప్రపంచమిథ్యాత్వమే జెప్పబడినది.

కారణాభిన్నరూపేణ కార్యం కారణమేవహి సద్రూపేణ సదా సత్యం భేదేనోక్తిర్మృషాఖలు అని విద్యాప్రపంచ సత్యత్వమును అవిద్యాప్రపంచమిథ్యాత్వమును జెప్పబడినది. అతఃకారణ విజ్ఞానాత్సర్వవిజ్ఞానమాస్తికాఃసుతరాముపపన్నో హియని అతఃఅనగా విద్యాప్రపంచము లోకార్యకారణములకు భేదములేనందున కారణవిజ్ఞానముచే సర్వకార్య విజ్ఞానము సిద్ధించునని చెప్పినది.

స్వయంచేతనమప్యే తత్కారణం నకులాలవత్ -అపేక్షతే మృదాతుల్యం అన్నచోట చేతనము కార్యబ్రహ్మగాని కారణబ్రహ్మగాదు. కార్యబ్రహ్మయవిద్యచే ప్రపంచమును కల్పించేటప్పుడు కారణాంతర నిరపేక్షముగా నొకయవిద్యచేతనే సర్వము సిద్ధించునని తాత్పర్యము. ఆశ్లోకములో జెప్పబడిన మాయయవిద్యయేగాని పరమాత్మ ప్రకృతి గాదు! యజ్ఞశాస్త్రిగారు గూడ నచట అపంచీకృతభూత స్రష్టయేజీవవేషముతో పంచీకరణకర్తయైనటుల నంగీకరించియున్నారు.

ఇందువలన సాక్షాత్పరమేశ్వర సృష్టమగు విద్యాప్రపంచములో కార్యకారణములకభేదము తాత్త్వికము భేదము కల్పితమునుగాని మిథ్యగాదు బహుస్యాం అని బుద్ధిపూర్వకల్పితముగదా.

అవిద్యాప్రపంచములో సర్వము భ్రాంతి సిద్ధమగుటచే మిథ్యయేగాని సత్యము గానేరదు.

ఇట్టిస్థితిలో యజ్ఞశాస్త్రిగారు సర్వత్రబాధాసామానాధికరణ్యమును జెప్పి సర్వము మిథ్యయనుట భ్రమగాదా. భాష్యకారాదులే ఆరీతివ్యుత్పాదన జేసినప్పుడు విరియపరాధమేనన జెల్లదు.

శివగీతలలో త్వన్మాయయాకల్పితమిందు మాశేత్వయ్యే వదృశ్యత్వముపైతివిశ్వం - భ్రాంత్యాజనః పశ్యతి విశ్వమేతచ్ఛుక్తౌ యథారూప్యమహించరజ్జౌ అనగా హేఇందుమశాళే త్వన్మాయయాకల్పితం

నీప్రకృతిచే రచియించబడిన విశ్వం విశ్వరూపము తత్వవేత్తలకు త్వ య్యేవదృశ్యత్వముప్రైతి నీయందే అనగా నిన్ను సాక్షాత్కరించిన వారికి గానవచ్చుచున్నది. ఏతద్విశ్వం ఈయవిద్యాప్రపంచమును జనః అజ్ఞజ నము భ్రాంత్యా - భ్రాంతిచేత శుక్తియందు రూప్యమునువలెను, రజ్జు వుయందు సర్పమునువలెను యజ్ఞాతమైన నీవిశ్వరూపమందు పశ్యతి జూచుచున్నది.

శ్లో॥ రజ్జౌభుజంగో భయదోయథైవన జాయతేనాస్తిన చైతినా శం త్వన్మాయయాకేవల మాత్రరూపంత థైవవిశ్వంత్వయి నీలకంఠ అనగా రజ్జువుయొందు భయంకరమైన సర్పమువలె యవిద్యాప్రపంచ ము పుట్టలేదు. ఒకప్పుడునుఉండలేదు. నశించబోదు. అనగాకాలత్రయ మందును లేకనే యజ్ఞజనులను దుఃఖపెట్టుచున్నది. తథైవ అదేరీతిని త్వన్మాయయా నీప్రకృతిచేత ఆత్తరూపం పొందబడిన స్వరూపముగల విశ్వంవిశ్వరూపము త్వయినీయందు తత్వజ్ఞులకు పురుషార్థభూతమై యున్నదియని శ్లో॥ విచార్యమాణే తవయచ్ఛరీరమాధారభావంజగతా ముపైతి తదప్యవశ్యం మదవిద్యయైవపూర్ణశ్చిదానంద మయోయత స్త్వం అర్థము హేనీలకంఠ విచార్యమాణే విమర్శించగా తవయ చ్ఛరీరం నీయాతివాహికశరీరమగు విద్యాప్రపంచము జగతాం సమష్టి వ్యష్టిజీవభేదముచేత భిన్నములగు నవిద్యాప్రపంచములకు ఆధారభా వం జలముకుమరుభూమివలె అధిష్ఠానభావమును ఉపైతియే పొందుచు న్నదో తదపి ఆపొందడమును అవశ్యం ముఖ్యముగా మదవిద్యయైవ జీవావిద్యచేతనే యావృతమైపొందుచున్నది. యతః - యొందువల్లనంటే త్వం - విశ్వరూపుడవగు నీవు చిదానందమయః పూర్ణశ్చ - అద్వితీ య సత్యచిదానందరూపుడవేను నీకు అవిద్యాభ్రమలు లేవని తాత్ప ర్యము. సదాశివుడు జూపిన విశ్వరూపమును జూచి శ్రీరామమూర్తి ప్రపంచద్వయమును జూచుచు పలికిన ఈశ్లోకములకిదే యర్థమని నిశ్చయింపవలెను.

విద్వద్వ్యాఖ్యగారు సదాశివుడు శ్రీరామచంద్రునకును శ్రీకృష్ణు

డర్జునాదులకును జూపిన విశ్వరూపము గారడియని శిశుపాలదుర్యో ధనాదులన్నటుల పరిచ్ఛిన్నమగు శ్రీకృష్ణాదిదేహములలో భాసించినది గాన అనురూపమైన దేశకాలాదులులేనందున మిధ్యయని మాయా మాత్రంతుకార్త్స్న్యేనా నభివ్యక్తస్వరూపత్వాత్ అని స్వప్నమిథ్యా త్వమును జెప్పు సూత్రమును దృష్టాంతమిచ్చి తమకుగల చార్వాకని శ్చయమును వెల్లడిపరిచిరి.

యవిద్యాప్రపంచ సత్యత్వమును విశ్వరూప మిధ్యాత్వమును దలంచిగదా నిటుల వ్రాసిరి చార్వాకనిశ్చయ మిట్టిదేగదా అవిద్యా ప్రపంచము మిధ్యయన్నందుకు శ్రుతి స్మృతులు ప్రమాణమై యు న్నవి విద్యాప్రపంచమనగ విశ్వరూపము సత్యమైనందుకు దివ్యచక్షు గ్రాహ్యమగుటచేతను - దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం అని విశ్వరూపములో నుండు గంధమాల్యా యుధాదులు గూడ దివ్య ములని జెప్పుటచేతను పరమార్థ సత్యమనియే జెప్పవలసె దివ్యము లనగ చిన్మయములని పరమార్థ సత్యములని యర్థము మరుజలా క్రాంతమైన మరుభూమి శుష్కప్రదేశము లేనిదగునా దుర్భిక్షాదుల లో జూడబడిన పర్వతము చితదేశాదులు లేనిదగునా విద్వద్యజ్వగారి యసంభావనలు విపరీతభావనలు బలమై గానవచ్చె - జన్మకర్మచమే దివ్యమేవం యోవేత్తితత్త్వతః - అని భగవద్వాక్యమున కెట్టిమంచి తాత్పర్యమును గ్రహించిరి - శ్రు - అథయదిదమస్మిన్ బ్రహ్మపురేద హారం పుండరీకం వేశ్మదహరోఽస్మిన్నంతరాకాశ స్తస్మిన్ యదంత స్త దన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యం అని ఛాందోగ్యాష్టమ ప్రపాఠకము లో - యావాన్వా అయమాకాశ స్తావానేషోంత ర్హృదయ ఆకా శఉభెద్యావాపృథివీ అంతరే వసమాహితే ఉభావగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమసావుభౌ ఇత్యాది గ్రంధముతో విద్యాప్రపంచమును వ్యుత్పాదనజేసి - అది అన్వేష్టవ్యం - అనగా ధ్యాననిష్ఠచేత వెతుకు కొనదగినది - అదివిజిజ్ఞాసితవ్యం అనగా గురువులవలన దెలియదగినదియ ని జెప్పి - ససర్వాన్లోకానాప్నోతి సర్వాన్శ్చకామాన్ - అని శ్రు తిలో ఫలమును జెప్పితే భాష్యకర్త అచ్చటి యాకాశాదులు భూతము

లు భౌతికములు గాన జడములని దలంచి యవి అన్వేషణీయములు జిజ్ఞాసితవ్యములుగావని ద్రోచివైచి వ్యవహితాన్వయముతో దహరాకాశమే అన్వేష్టవ్యము జిజ్ఞాస్యమునని జెప్పి అట్టి దహరవాక్యము పాస్తిపరముగాన ముముక్షువుల కనావశ్యకమని తాత్పర్యమును జూపిరి వ్యాఖ్యాతలు ఆమార్గమునే యనుసరించిరి ఆగ్రంథములను జదివి యజ్వశాస్త్రి మొదలగు పండితులు విద్యాప్రపంచమే లేదనియు తత్త్వజ్ఞులు నిర్గుణబ్రహ్మలోనే గలసిపోవుదురనియు బాదరిమతానుసారమైన నిశ్చయముతో విఘటించు చున్నారు - సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ - కస్మిన్ భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి ఇత్యాది శ్రుతుల ప్రకార మేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞను ముక్తునకు యుగపత్సర్వకామావాప్తిని ద్రోసివైచి సర్వము మిథ్యయని రూఢిజేసుకునిరి శ్రుతి దహరాకాశరూపాక్షరతత్త్వములోనుండు పృథివ్యాదిభూతభౌతికములకును తదోభ్యక్తలగు ముక్తజీవులకును తత్ఫలప్రదాతయగు పరమేశ్వరునకును ఏతత్సత్యం బ్రహ్మపురం తఇమేసత్యాః కామాః అని సత్యత్వమును చిద్రూపతనుజెప్పుచున్నది. భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వాయని శ్రుత్యంతరమును జెప్పుచున్నది. యావాన్ వాఽయమాకాశ స్తావానేషోంతర్హృదయ ఆకాశఇత్యాది వాక్యములతో న విద్యాప్రపంచములో నుండుయాకాశాదులనుదృష్టాంతమిచ్చి బోధించెగదా? నచట ప్రపంచద్వయమునకుగల భేదమును అవిద్యాప్రపంచమునకుగల జడత్వమిథ్యాత్వదుఃఖరూపత్వాదులను విద్యాప్రపంచమునకుగల సత్యత్వసుఖరూపత్వచిన్మయత్వాద్వయత్వాదులను నిశ్చయించని వారెటులతరింతురు. అహో దురాగ్రహమునకు మితిలేదుగదా.

సాధిభూతాధిదైవం మాంసాధియజ్ఞంచయేవిదుః యస్మాత్ క్షరమతీతోహమక్షరాదపిచోత్తమః యని ఉపక్రమోప సంహారములలో భగవంతుడు జెప్పిన యర్థమునుగూడ మనస్కరించరైరి. అహో నాస్తికత్వమేమనవచ్చును. విద్వద్యజ్వగారుసృష్ట్యాదికాలములోనే అపంచీకృతాకాశాదులు నిరవశేషముగా పంచీకృతములయినవిగాన యపంచీకృతభూతభౌతికాత్మకమగు విద్యాప్రపంచము గగనారవిందసదృశమని

జెప్పి శ్లో॥ తద్గతాని విమిశ్రాణివివిక్తాని పునర్యథా నశుద్ధాన్యుపల
భ్యంతే సర్వనాశాంతమేవహియని పురాణవచనమునుదహరించిరి.
అచట పరిణామప్రక్రియచేక్షీరము దధియైన చందమున నపంచీకృతము
లు పంచీకృతములయి పోయినటుల నందుచేత నపంచీకృతములు శేషిం
చనటుల తాత్పర్యపడిరిగదా అహో భ్రమ. సిద్ధాంతమట్లుగాదు. అపంచీ
కృతములుచిన్మయములు ఆవృతములై జీవదృష్టిలోపంచీకృతములు అన
గాస్థూలములు జడములుగావివర్తించినవి. అందుచేత నపంచీకృతములు
నశించిపోలేదు సర్పరూపమై వివర్తించిన రజ్జువవలె నజ్ఞాతములై
యథాపూర్వముండనే యున్నవి. తత్వజ్ఞానముచేత నజ్ఞానావరణము
నివర్తించిన విద్వాంసులకు గమ్యమగుచున్నవి గదా యజ్వశాస్త్రి
గారుదహరించిన వచనమువల్లనే నశుద్ధాన్యుపలభ్యంతే సర్వనాశాంత
మేవహియనుటవల్ల మూలావిద్య నశించితే యపంచీకృతములుపలబ్ధ
ములగునని దెలియవచ్చుచున్నదిగదాఆయవిద్యశ్రద్ధాభక్తిధ్యానయోగా
దవేహీత్యాది శ్రుతులవల్ల ఫలకామనలేకుండ నీశ్వరారాధన బుద్ధితో
ననుష్టించిన స్వస్వవర్ణాశ్రమోచితకర్మలచేతను ధ్యాననిష్టచేతను
పరమేశ్వరుని యందననన్యభక్తి చేతను శ్రవణాదులచేతను నివర్తించున
ని దెలియవచ్చుచున్నదిగాని ఈశ్వరుడు మిథ్యసర్వప్రపంచము మిథ్య
యను కుతర్కజన్యజ్ఞానముచే నివర్తించదు దహరవాక్యము పాస్తి
పరమని ముముక్షువుల కనావశ్యకమని జెప్పిరి ఉపాసీతయని జెప్పిన
ప్పుడు పాసనాపరమెట్లులగును అన్వేషణీయమనియు జిజ్ఞాస్యమనియు
గదా జెప్పియున్నవి ఉపాసన ముముక్షుల కనావశ్యకమన్న మాటగూడ
నెట్టిహో ప్రదేశమో విమర్శించుడి సుషుమ్నా మార్గము మోక్ష
మార్గమని శ్రుతి స్మృత్యాదులన్నియును ఘోషింపుచుండ నది క్రమ
ముక్తి సాధనము కార్యబ్రహ్మలోక ప్రాపకమని వేరుగా సద్యోముక్తి
సాధకమున్నటుల భాష్యకారాదులు బోధించిన విపరీతబోధను గూడా
విచారించుడి వేరైన జ్ఞానము తర్కకౌశలమని గదా వారి తాత్పర్య
ము. అట్టి జ్ఞానము మోక్షసాధనమగునా అహహావిపరీతబోధ. భాష్య
ములో మంగళాచరణ లేకుండ బ్రహ్మజిజ్ఞాసను వదలి ముందుగా నథ్యా

నజిజ్ఞాస జేసినదియు అనాత్మవాచకమగు యుష్మచ్ఛబ్దముతో నారం భించుటయు మంగళమనే జెప్పవచ్చును అధ్యాసయనగ భ్రాంతిజ్ఞానము గదా నదిస్వరూపముచే నమంగళమైనను దాని జిజ్ఞాసమంగళమే సర్వ జగత్తు ఈశ్వరుకును ధ్యయనుటకు సాధనముగా గదా ముందుగా నధ్యాసను వర్ణించినది అట్టి మిధ్యాత్వ నిశ్చయముకూడ పరమమం గళమేసరి - శ్రు - అసన్నేవసభవతి - అసద్బ్రహ్మేతివేదచేత్ - అని శ్రుతిజెప్పుచున్నది - అసత్ అనినను - మిధ్యయనినను పర్యాయములే కదా సూత్రభాష్యమందు ఉపనిషద్భాష్యమందును గల దురుక్తులను ఆనుపూర్విగా మాసూత్ర తాత్పర్య దీపకలోను ప్రభలోను జూపబడ లేదు. కొన్ని మట్టుకే జూపబడినవి పరమేశ్వర సంకల్ప మున్న యెడ ముందు జూపగలము. గీతాతాత్పర్యదీపికలో దాని భాష్యమందుండు దురుక్తులనానుపూర్విగా జూపి యున్నాము దయచేసి విమర్శించి జూడుడి సుజనులారా మాభాష్యకర్త నాక్షేపించినాడని కోపించకుడి మతకర్త జెప్పిన భాష్యములో తప్పులెన్నుట దోషమని దలంచకుడి- విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః - అనినటుల దోషములనుజూపి జనులను సర్వ ము మిధ్యయను నాస్తికతలోనుండి మళ్లించి యాస్తికుల జేయుటయు బాదరాయణ వైదికాద్వైత సిద్ధాంతమును ప్రకటనలోకి దెచ్చుటయు లోకోపకారమనియు సుకృతమనియు దలంచుడి ప్రస్తుతము దలచకపో యిన క్రమముగా దలంచగలరని మానమ్మకము - విప్రాఃపశ్చిమబుద్ధ య అని న్యాయము కార్యబ్రహ్మ వైభవముతో భాష్యసమాప్తి జే సినదియు పరమ మంగళమే గదా.

యజ్ఞశాస్త్రిగారు జన్మాదిసూత్రములో అస్యయను పదముకు భాష్యకర్త వ్రాసిటుల ప్రత్యక్షాది ప్రమాణ సన్నిధాపితమగు నవి ద్యాప్రపంచమే యర్ధమని జెప్పిరి అవిద్యాప్రపంచము సాక్షాద్బ్రహ్మ కార్యముగాదు అవిద్యాకార్యమని దలంచక నటుల జెప్పిరి గాని విష యవాక్యసన్నిధాపితమగు నీక్షణాదిప్రవేశాంత సాక్షాదీశ్వర సృష్ట వి ద్యాప్రపంచమే అర్ధము భ్రమయేల అవిద్యాప్రపంచము కార్యకార ణభేదశ్చ సర్వం భ్రాంత్యాప్రసిధ్యతియని యజ్ఞశాస్త్రిగారుదహరించి

న పురాణవచనమువల్లనే సాక్షాద్బ్రహ్మాకార్యము గాదని దెలియవచ్చు గదా

భాష్యములో - ఆత్మాహిబ్రహ్మ - బ్రహ్మణిచకర్మనసంభవతి-అతఃకర్మా నావశ్యకం మోక్షస్య కార్యత్వాచ్చ కర్మానర్థక్యం అని వ్రాసిన బోధగూఢ బహుమంచిదే. అనగా జీవుడు బ్రహ్మగానకర్మ సంభవించదనియు - మోక్షము కార్యముగాదు గాన కర్మవ్యర్థమని జెప్పినదియు మంచిబోధగాదా - అధికంతుభేదనిర్దేశాత్ - అనిన్యాయసూత్రము ప్రతిబింబరూపుడగు జీవుని కన్న బింబరూపుడగు పరమేశ్వరుడధికుడ నియర్థము - ఆభాసఏవచ - అనగా జీవుడా భాసరూపుడు ఇత్యాది సూత్రములను శ్రుతులను మరచి వ్రాశి యుందురు మోక్షము కార్యముగాకపోయినను - కషాయేకర్మభిః పక్వేతతో జ్ఞానం వివర్ధతె యని చిత్తకాలుష్య నివృత్తికై కర్మల వశ్యానుష్ఠేయములుగదా

నస్థానతోపి పరస్యోభయలింగం సర్వత్రహియను సూత్రములో పరమాత్మకుడుపాధివల్లకూడరూపద్వయము తాత్వికమైసంభవించదని భాష్యములో వ్రాసినది యసంగతము గాదా - పాదోऽస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి - అవస్థితే రితికాశకృత్స్నః - వికారావర్తిచ తథాహిస్థితిమాహ - ఇత్యాది శ్రుతి సూత్రములచే పరమాత్మకు రూపద్వయమును పరమార్థ సత్యమని సిద్ధాంతము గదా సూత్రములో ఉభయలింగం అను పదమును వెనుకకు అన్వయించి సర్వత్రహి అను పదమొకటిని హేతువాచకముగా నన్వయించిరి దాని యర్థము సర్వత్రశ్రుతులలో అస్థూలమనణ్విత్యాది వాక్యములచే నశేష విశేష నిషేధముఖముగా బ్రహ్మ బోధించబడు చున్నదని వ్రాసిరి సత్యం జ్ఞానమానందం సర్వజ్ఞం సర్వశక్తి సర్వాత్మకము సత్యకామము సత్యసంకల్పమని విధిముఖముగా నితరశ్రుతులు-బోధించ లేదా అందుచే సవిశేష నిర్విశేషోభయరూపము సత్యమని సిద్ధించదా నిరాకారం క్వాపిక్వచిదపిచసాకారమమలం అని రూపద్వయమును ఉత్తర కాలములో భాష్యకర్తయే వొప్పియుండెగదా

సూ—అరూపవదేవహి తత్ప్రధానత్వాత్ - అను సూత్రము లో అరూపము త్రిపాద్విభూతిగాన ప్రధానమనిజెప్పితే నేకపాద్విభూతి య ప్రధానమని సిద్ధించును గాని మిధ్యయని సిద్ధించునా ఈ సూత్ర ములో రూపవిచారము జెప్పబడుచుండగా నస్థానతోపి యను పూర్వ సూత్రములోకూడరూపవిచారమనిజెప్పుట యసంగతముగాదా

శ్రు - ద్వేవావబ్రహ్మణోరూపే మూర్తంచైవా మూర్తంచ - అథాతఆదేశో నేతి నేతి - నహ్యేతస్మాదితి నేతి - అన్యత్పరమస్తి - తస్య నామధేయగ్ం సత్యస్య సత్యమితి - ప్రాణావై సత్యం తేషా మేమసత్యం అను బృహదారణ్య శ్రుతికి భాష్యములో ముందుగా - ఏతస్మాత్ - నిర్గుణబ్రహ్మకంటె అన్యము - నేతి - లేదనివ్రాసి యద్వాయని ప క్షాంతరములో - ఏత్మస్మాత్ - ఈ ఉపదేశముకంటె వేరు ఉపదేశ ము లేదని యర్థము వ్రాసిరి ప్రకారవాచకమగు నితిశబ్దమును స్వ రూపమర్థముగా జెప్పిరి నేతియను శబ్దముకు మరియొక ఇతిశబ్దమును జోడించి - నేతీత్యస్యకోఽర్థః -యని వికల్పించి- అన్యత్ యను ముం దు వాక్యములోని పదమును వెనుక వాక్యములో గలిపి నిర్గుణబ్ర హ్మకంటె యన్యము లేదని యర్థము వ్రాసిరి. నిర్గుణబ్రహ్మఉన్న దనుటచే శూన్యవాదము ప్రసంగించక పోయినను శూన్యప్రసంగము రాకుండ పరమస్తియని జెప్పినటుల యర్థము వ్రాసిరి-సత్యస్యసత్య మని - ప్రాణావై సత్యం అని ప్రాణములకు రెండుమారులు సత్యత్వము ను శ్రుతి జెప్పితే తాము మిథ్యాత్వమును జెప్పిరి -ఇట్టి యపతాత్పర్య ము లెన్నియని జెప్పుదుము వాటినే సత్యమని శఠించువారికి జెప్పశ క్యమగునా ఈశ్రుతికి సూత్రతాత్పర్యదీపికలోను ప్రభలోను సదర్థ మును జూపియున్నాము అనగా ప్రథమమందు నిషేధించిన రూపద్వ యము సమష్టిజీవా విద్యాధ్యస్తమగు పంచీకృతము ప్రాణావైస త్యంఅని జెప్పినవి. యపంచీకృతములు సాక్షాత్పరమాత్మ సృష్టములు గాన పరమార్థ సత్యములు ప్రాణశబ్దముచేత నింద్రియములును వా యు కార్యములగు ప్రాణములును వాటి కారణములగు అపంచీకృత భూతములును అనగా విద్యాప్రపంచమంతయు వివక్షించబడును దాని

కన్న పరమైన సత్యము పరమాత్మయని యర్థము ఇట్టి యర్థమును శ్లో॥ యస్మాత్ క్షరమతీతో హమక్షరాదపిచోత్తమః - అతోస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః - యని భగవంతుడు జెప్పియున్నాడు ఇట్టి సదర్థమును వొదిలి సర్వము మిథ్యయనుట భ్రాంతిగాదా

యజ్వశాస్త్రిగారు వైకుంఠ కైలాసాదులు కార్యబ్రహ్మలోకములో నంతిర్భూతములని యసత్యములని జెప్పిరి - శ్రు-వైకుంఠభవనంగమిష్యతి - తదిదం పుండరీకం విజ్ఞానఘనం అని శ్రుతిలో వైకుంఠాదులు విజ్ఞాన ఘనములై హృదయమందున్నటుల జెప్పిన శ్రుత్యర్థముల నెంతబాగా నిశ్చయించిరో జూడుడి.

వైకుంఠవాసులగు జయవిజయులు తిరిగి సంసారములో జన్మకు రాలేదాయని వ్రాసిరి గాని యవిద్యచేత జన్మలకు రాలేదు భగవంతుడు ధర్మసంస్థాపనాద్యర్థములకై జన్మించి నటుల జయవిజయులు శాపాదినిమిత్తాంతరముచే జన్మకు వచ్చుట యవిద్యచేగాదు గాన పునరావృత్తియన గూడదు.

భక్తులకు ధ్యానకాలములో పరమేశ్వరుడు సాక్షాత్కరించబడునెడ నది విధురపరిభావిత కామినీ సాక్షాత్కారవద ప్రమాణమని వ్యాఖ్యాతలును యజ్వశాస్త్రిగారును వ్రాసిరి యెట్టి చార్వాక నిశ్చయమో జూడుడి స్వతస్సిద్ధమైన వస్తువు అవిద్యాంధకారాదులచే నావృతమై ధ్యానాదిసాధనములచేత - అపిసంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం అను న్యాయసూత్ర ప్రకారము సాక్షాత్కరించబడిన పరమార్థము విధురపరిభావితకామినీ సాక్షాత్కారము వంటిదని దలంచువారికి శ్రేయస్సు గలుగునా మోహనమారణాది ప్రయోజనార్థమై కల్పించబడిన కృష్ణదంతం కృష్ణవాససం కరాళవక్త్రి మిత్యాది రూపములుగూడ బుద్ధిపూర్వ కల్పితములు శాస్త్రకల్పితములునై భ్రాంతికల్పితములు గానందున మిథ్యగా బోవుగదా స్వతస్సిద్ధమై పరమార్థ సత్యమైన పరమాత్మ రూపము లెటుల మిథ్యయగును.

యాజ్ఞిక నారాయణమని జెప్పబడు నుపనిషత్తులో పరమా

త్మయొక్క గుణప్రధాన రూపములు భక్తులకు పాస్యమైనటుల వేరు వేరుగా జెప్పబడియున్నవి.

౧ పురుషస్య విద్మసహస్రాక్షస్య మహాదేవస్య ధీమహియని పురుషసూక్తాదులలో జెప్పబడిన యద్వితీయమగు ప్రధాన మూర్తిణ జెప్పబడియె.

౨ తత్పురుషాయ విద్మహేమహాదేవాయ ధీమహియని లయకర్తయగు రుద్రరూపము జెప్పబడినది.

3 వక్రతుండాయధీమహి - చక్రతుండాయధీమహి - మహాసేనాయధీమహి యని గణపతి నంది షణ్ముఖులు పాస్యులని జెప్పబడె.

౪ వేదాత్మనాయ విద్మహేయని సృష్ట్యధిదైవమగు బ్రహ్మధ్యేయమని జెప్పబడియె.

౫ నారాయణాయ విద్మహేయని పాలనక్రియాధి దైవమగు విష్ణువు పాస్యుడని జెప్పబడియె.

౬ వజ్రనఖాయవిద్మహే - భాస్కరాయవిద్మహే - వైశ్వానరాయవిద్మహే - కాత్యాయనాయవిద్మహే - యని నృసింహ సూర్యాగ్నిదుర్గలు పాస్యులని జెప్పబడె.

ఈ మూర్తులన్నియు స్వతస్సిద్ధములై ధ్యేయములై తారకములై యున్నటుల శ్రుతి జెప్పుచుండ పరమాత్మకు సవిశేషరూపమే తాత్వికమైలేదని మన భాష్యకారాదులు బోధించిన వ్యుత్పత్తి యెంత ప్రమాణమైనదో జూడుడి - శ్రు - ఆకాశోహవై నామ నామ రూపయోర్నిర్వహితా - తేయదంతరాతద్బ్రహ్మ వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణంత మస స్తుపారే - సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామానికృత్వా యని శ్రుతులలో తమస్సుకు పరమైన పురుషుడును ఆయనచే నిర్వహించబడిన అనగా చేతితములైన నామరూపములును సత్యములుగావా - కార్యకారణభేదశ్చ కారకవ్యావృతిస్తథా ఉత్పత్తిశ్చ వినాశశ్చ తథైవార్థ క్రియాపిచ - నామరూప విభేదశ్చ

సర్వం భ్రాంత్యా ప్రసిధ్యతి యని యజ్వశాస్త్రిగా రుదహరించిన పురాణవచన ప్రకారము భ్రాంతి సిద్ధనామ రూపాదులును వెనుక పరమేశ్వరునిచే కల్పించబడిన నామరూపాదులును వొకటేనా సర్వం మిథ్యయనుట యెంతభ్రమో విచారించుడి.

తథావిద్వా న్నామరూపా ద్విముక్తః అను శ్రుతి విదేహముక్తుడు పరమాత్మలో లీనుడగుటచే సుషుప్తునివలె విద్యాప్రపంచ గతనామరూపములనుగూడ ననుభవించడని - సూ - స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమా విష్కృతంహి - యని న్యాయసూత్రముచే నిర్ణయించబడియున్నది జీవన్ముక్తుడైతే యవిద్యాప్రపంచగత నామరూపములతో విడువబడును విద్యాప్రపంచగతపారమార్థిక నామరూపములతో జీవన్ముక్తవిహారము జరుగును తత్వజ్ఞునకు దేహపాతానంతరమందు జీవన్ముక్తవిహారముండునని - సతత్రపర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః ఆత్మరతిరాత్మక్రీడ ఆత్మమిథున ఇత్యాది శ్రుతులు జెప్పుచున్నవిం బ్రహ్మసూత్ర ద్వితీయాధ్యాయ తృతీయపాదములో పరమేశ్వర సాక్షాత్సృష్ట విద్యాప్రపంచగత భూత భౌతికములయొక్క ఉత్పత్తి లయక్రమ విచారముజేసి యవి సత్యములని సూచింపబడె. చతుర్థపాదములో జీవావిద్యాధ్యస్తములగు భూత భౌతికములు మిథ్యయని సూచించబడెను వాటివిభాగమును బ్రహ్మసూత్ర తాత్పర్యదీపికలోను ప్రభలోను వివరించి యున్నారము.

అధ్యాసభాష్యములో పూర్వప్రమానిరపేక్షముగ నధ్యాసతజ్జన్య సంస్కారములు బీజాంకురములవలె ననాదియని సిద్ధాంతపరచి ఉత్తరగ్రంథములో - అంధపరంపరైవైషా అనాదిత్వకల్పనా యని వ్రాసిరి వాసిష్టములో - ద్విత్వంనకర్మణోర్యస్య బీజాంకురతయానయోః - విపశ్చిత్పశవేత స్మై మహతేఽస్తు సదానమః యని నిందించి యున్నాడు

సచ్ఛబ్దవాచ్యమవిద్యాశబలం బ్రహ్మ - బ్రహ్మణోఽవ్యక్తమిత్యాది శ్రుతులలో బ్రహ్మశబ్దము పరమాత్మ పరమనిజెప్పి పరమాత్మ

కే యవిద్యను జెప్పి యవిద్యకనాదిత్వమును జెప్పిరి యెంతపొరపాటు జూడుడి పరమాత్మకు విద్యసంభవించునా అవిద్యభావ పదార్థమను చు ననాదియనిన యనాదిభావమునకు నివృత్తి గలుగునా గలిగేయడల పరమాత్మకుగూడ నివృత్తి గలుగవలసెగదా - వా-యత్రవేత్తి తు జీవత్వం తత్రావిద్యేతితిష్ఠతి - తత్రసంసృతినామ్నా౽యంధత్తేరూపం తథాస్థితం-అనగా ప్రతి బింబరూపుడు పాధిమాలిన్యముచేత నెప్పుడు బ్రహ్మభేదమును మరచి జీవత్వమును ప్రాణధారణ నిమిత్తముచే దలంచునో అప్పుడతనికి అవిద్యయేర్పడి దానివల్ల సంసారమనే పేరుతో జన్మమరణాదులను జెందునని జెప్పబడి యున్నది. ఇందుచేత నాయాజీవులకవిద్య కాదా చిత్కల్పమై గలిగి తత్వజ్ఞానముచే నివర్తించుచుండి యవిద్యాదృష్టిలో నాది గానరాకయుండును అవిద్యగలుగ నప్పుడు ప్రతిబింబులకు విద్యాప్రపంచా నుభవముండ వచ్చును తజ్జన్యప్రమా సంస్కారముచేత తత్తాంశప్రముషితమై అవిద్యాదశలో నధ్యాస ప్రథమవ్యక్తిగలిగి దానివల్ల సంస్కారము దినుగ నధ్యాసయు ప్రవాహముగ తత్వజ్ఞానము గలుగువరకు గలుగుచున్నట్లు జెప్పుట యుక్తమైనను విద్యాప్రపంచమున పలపించు తాత్పర్యముచేత జెప్పరైరి

అనాదినిధనానిత్యావాగుత్సృష్టా స్వయంభువాయని నిత్యములైన వేదములకు ద్విపరార్థ కాలస్థాయి వ్యావహారికత్వమును జెప్పి మిథ్యాత్వమును పర్యవసింప జేసిరి భాష్యకర్త జెప్పిన - సర్వాత్మత్వమితిస్ఫుటీకృతమిదం యస్మాదముష్మింస్తవే యని దక్షిణామూర్త్యష్టకములో పరమాత్మయొక్క సర్వాత్మత్వమును స్ఫుటముగా జెప్పియున్నామనియు అట్టి స్తోత్రపఠనాదులచే భక్తులకు - సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వతస్సిద్ధ్యేత్ అనగా- సర్వాత్మత్వ వైభవముగల ఈశ్వరసాయుజ్యము సిద్ధించునని జెప్పిన మాటను అచ్చట సత్యమని జెప్పినారా అది సత్యమై సంభవించునా యని యజ్వశాస్త్రిగారు స్వయముగా వ్రాసిరి ఇట్టి వారికి. సర్వమిథ్యాత్వమును జెప్పు భాష్యము పఠథమన్నామని మామీద యాగ్రహమేల



మా గ్రంథములో నెచ్చటను శంకరద్వేషణ జేయబడలేదు బా
గా విమర్శించి జూడుడి మరేమన శంకరుడు కైలాసవాసియే గాన
వారు జెప్పిన యసదర్థములనుగూడ నతిక్రమించరాదని నిర్బంధ పె
ట్టుచు - శ్లో - సదాశివసమారంభాం బాదరాయణ మధ్యమాం
అనుపురాతన పాఠమును దప్పించి శంకరాచార్య మధ్యమాంఅని
కల్పించి పురాణాది ప్రాశస్త్యంవా నిరస్యత ఇతివస్తుగతిఃయనగ
వ్యాసప్రోక్తములగు పురాణభారతభాగవతాదులు ప్రశస్తములుగా
వని అనగ పప్పుభొట్లమాటలకింద నిశ్చయించుట వస్తుతత్వమనియు
సవిశేషబ్రహ్మయు తత్సృష్టప్రపంచమును మిధ్యయని కుతర్కముల
తో ప్రబలించిన భాష్యములయందు దోషములను జూపితిమి. అంత
మాత్రముచేత శంకరభక్త్యున్మూలితముగా లేదు. కృతత్రేతాయుగముల
లో గౌతమకణాద కపిలాదులు జెప్పిన పరమాణుప్రధానకారణవాద
ములను నిరసించితే వారు మహర్షులుగా లేదా వారికిగల మహాత్వము
పోయెనా నదేరీతి రెండువేల సంవత్సరములక్రిందట వ్రాయబడిన శాం
కరభాష్యమును దోషములనుబట్టి నిరసించినద తప్పగాదు. శంకరుల
వారుత్తరకాలమందు బహుస్తోత్రములలో విష్ణుశంకర త్రిపురసుంద
ర్యాది సగుణమూర్తులయందు తమకుగల భక్త్యతిశయమును ఆస్తిక
త్వమును స్ఫుటముగా జూపిరి. అందువల్ల వారికిగలిగిన లోకపూజ్యత
స్థిరమైయుండనేయున్నదిగదా. మరేమన శంకరులు ప్రథమవయస్సులో
నే నొకగురువువల్ల సర్వముమిధ్యయను బౌద్ధమతమును పదిష్టులై
దానియందలి ప్రామాణ్యనిశ్చయముచేత భాష్యములనురచియించి తమ
కుగల పౌరుషమునంతయు వినియోగపరచిరి. ఉత్తరకాలమందు గంగా
ప్రవాహములో కొట్టుకొనిబోయ్యెడి వస్త్రమునుగ్రహించుటకు శక్తి
లేదనిన స్త్రీవేషములో పరమేశ్వరుడు శక్తియను పదార్థమొకటి
యున్నదాయని యాక్షేపించిన నంతట వెనుకటి నిశ్చయమునుండి మా
రి శివశ్శక్త్యాయుక్తోయది భవతిశక్తః ప్రభవితుం ఇత్యాదిబహు సగుణ
స్తోత్రములను రచియించుటుల గానవచ్చుచున్నది గాని పూర్వమందీ
శ్వరుని మిధ్యగావ్రాసిన భాష్యములు సవరణకాలేదు. అందుచేత వా

టిని నమ్మి కుతర్కములతో రచియించిన గౌడబ్రహ్మానందీ కల్పతరు పరిమళాదిగ్రంథములు నేటిసర్వజగన్మిథ్యాత్వమునే బోధించుచున్నవి. భగవంతుడుగీతా ౧౨, ౧౬, ౧౭, ౧౮ అధ్యాయములలో నీబాదరాయణులోయుల మతములను తామసనిశ్చయములని ఆసురసంపత్తియనియు నిందించియున్నాడు జూడుడి. శంకరులు ప్రథమమందు విశ్వేశ్వరునితో నేశంమయాకల్పితం అని యుత్తరమిచ్చినట్లు ఉత్తరకాలములో శివశ్శ్రాద్ధయుక్తోయది భవతిశక్తః ప్రభవితుం కథమకృతపుణ్యాః ప్రభవతి యనినట్లు ఈరెంటిని యాలోచించితే ఉత్తరకాలములో వారి నిశ్చయము మారిపోయినటుల స్పష్టపడును

తత్త్వరసామంజస్యాత్ అను సూత్రప్రకారము తటస్థేశ్వరునకు జగత్కారణత్వము నిరసించబడినను శ్లో॥ యోయోయాంయాంతనుం భక్తశ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి ఇత్యాదిగ్రంథములో భగవంతుడు పరిచ్ఛిన్నదేవతుల నారాధించువారికి పరిచ్ఛిన్నఫలమే సిద్ధించినను మిథ్యాత్వబుద్ధిలేక సత్యతానిశ్చయముండుటచేత క్రమముగా జ్ఞానప్రాప్తులగుదురనియు సర్వము మిథ్యయను తామసులకు నచతత్ప్రేత్యనోఇహ అనగా నిహాపరములలో మిథ్యాత్వబుద్ధితో జేసిన కర్మలు భక్తియు నిష్ఫలములని దూషించియున్నాడు. బాగా నాలోచించుడి.

గాన ముముక్షువులయినను కాకపోయినను ఆస్తికులందరు ఈశ్వరమిథ్యాత్వమును స్వప్నములోనయిన దలంచక ననన్యభక్తి జేసి కర్మఫలార్పణముల చేతను ధ్యానవిష్ణుల చేతను శ్రవణాదిప్రయత్నముల చేతను పురుషార్థులుగమ్మని మహోపదేశము.

అధ్యారోపాపవాదాభ్యాంనిష్ప్రపంచంప్రపంచ్యతేయనుశ్రుతివాక్యము అవిద్యాప్రపంచముకే అధ్యారోపమునుఅపవాదనుజెప్పుచున్నదిగాని విద్యాప్రపంచముకుగాదు విద్యాప్రపంచము ఆవేదములో బోధకై జెప్పుటేగాని యచ్చట ప్రపంచశబ్దమే ప్రవర్తించదు. బ్రహ్మాయసియే శ్రుతిస్మృతులలో సర్వత్రజెప్పబడును. దానికి అపవాదసంభవించదుగదా మమయోనిర్మహద్బ్రహ్మాయని సర్వంఖల్విదంబ్రహ్మ పు

రుషవవేదగ్ం సర్వంఅని ప్రయోగములజూడుడి. విద్యాప్రపంచము బ్రహ్మకార్యమగుటచే బ్రహ్మభిన్నమే మృత్తికేత్యేవసత్యం అనగా ఘటశరావాదులను మృత్తికయని వ్యవహరించుట సత్యమైనదన్నటుల సర్వంఖల్విదం బ్రహ్మతజ్జలానితిశాంత ఉపాసీతయని జెప్పబడుచున్నది.

గాన కొంచెము వ్యుత్పత్తిగలబుద్ధిచేత పదపదార్థజ్ఞాని బోధన సహాయముతో ఉపనిషదర్థమును పురాణాదులను దెలుసుకొని శ్రద్ధాభక్తులతో సవిశేషనిర్విశేషోభయరూపము పరమార్థ సత్యమని నమ్మి పరమాత్మను భజించుడి-అట్లుగాక బహుశాస్త్రములు జదువనిది మోక్షముసిద్ధించదని భ్రమించకుడి శ్లో॥ అన్యథా శాస్త్రగర్తేషులు ఠతాంభవతామిహ - భవత్యక్రుతి మాజ్ఞానాం కల్పైరపిననివర్త్యతిః అని వాసిష్టములో దూషించబడియున్నది.

సంసారతారకమైన జ్ఞానము భగవద్గీతలలో జెప్పిన యమానిత్వ మదంభిత్వమహింం సాక్షాంతిరాజవ మిత్యాదిలక్షణమేగాని శాస్త్రపాండిత్యమాత్రము గాదు.

జ్ఞేయమైన పరతత్వము జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామియద్ జ్ఞాత్వా ఉమృతమశ్నుతే అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే - సర్వతః పాణిపాదంతత్సర్వతోక్షి శిరోముఖం అని శ్రు - ఏతద్వై తదక్షరంగార్గిబ్రాహ్మణా అభివదంత్య స్థూలమనణ్వహ్రస్వం - నతదశ్నాతికించన - నతదశ్నాతికశ్చన - ఏతస్యవాఅక్షరస్య ప్రశాసనేగార్గిసూర్యాచంద్రమ సౌ-ద్యావాపృథివ్యౌ విధృతౌతిష్ఠత ఇత్యాదిశ్రుతులు స్మృతులు జెప్పిన సవిశేషనిర్విశేషోభయరూపముగాని కేవల కూటస్థరూపమేగాదు. సవిశేషరూపమెన్నటికిని మిథ్యగాబోదు.

జ్ఞానసాధనమును గీతాప్రథమషట్కములో జెప్పినరీతుగా ఫలత్యాగపూర్వకస్వ స్వవర్ణాశ్రమోచితకర్మ యుధ్యాననిష్ఠయు పరమేశ్వరభక్తియుగాని బ్రహ్మచర్యమునుండి సన్యసించుటగాదు. ఈశ్వరుని మిథ్యయని కుతర్కములనేచుటయునుగాదు.

ముక్తియనగ అవిద్యలోనుంచి వెడలి శుద్ధసత్వవికాసకాలము లో సర్వవిజ్ఞానయుగపత్సర్వకామావాప్తుడు సత్యకాముడు సత్యసం కల్పుడగుటయు సత్వసంకోచకాలములో నిర్గుణనిష్క్రియకూటస్థ బ్రహ్మమాత్రుడై యుండుటయుగాని కేవల కూటస్థమాత్రముగాదు. గాన సర్వమనవద్యం

శ్లో॥ నమో ఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరు బాహవే - సహస్రనామ్నే పురుషాయశాశ్వతేసహస్ర కోటీయుగధారిణేనమః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్సదానంద తీర్థశిష్య శ్రీమద్వ్యాస ప్రసాదాసాదితతత్వ నిశ్చయ శ్రీ అద్వైతానంద తీర్థ విరచితం ప్రభామండనం

సమాప్తం.

ఓం తత్సత్.





శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీమద్గురుభ్యోనమోనమః

ఓం నమః పరమాత్మనే

# దీపికామండనము.

ఓం నమో స్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః॥ ౧॥

దీపికాఖండనాభాసం గురునాథసుధీరితం। నివార్యసత్ప్రక్రియయాతన్మండనమిహోచ్యతే॥ ౨॥

సుజనులారా!

కొద్దికాలమునుంచి పరమేశ్వర ప్రేరణబలముగా గలిగి లోకోపకారముకై సంస్కృతభాషలో మాచే రచియింపబడిన గ్రంథములు.

౧ పంచోపనిషత్తాత్పర్య దీపిక అద్వైతానందలహరియను రెండవనామ గలది.

౨ తైత్తిరీయక తాత్పర్యదీపిక

3 ఛాందోగ్యషష్ఠప్రపాఠక తాత్పర్యదీపిక

౪ బ్రహ్మసూత్ర తాత్పర్యదీపిక

౫ శ్రీ భగవద్గీతా తాత్పర్యదీపిక

౬ బ్రహ్మసూత్ర తాత్పర్యదీపికాప్రభ

౭ ప్రభామండనము

ఇటుల గ్రంథసప్తకము రచియింపబడి యున్నది.

వీటివలన జనులకు గలిగెడి యుపకారమెట్టిదనిన ఇదివరకు శ్రీ శంకరాచార్యప్రభృతి శ్రీవిద్యారణ్యస్వామిపర్యంతనవీనగ్రంథ కర్తల చే రచియింపబడిన భాష్యాది గ్రంథములచేతను వారి బోధ ప్రాగల్భ్య ముచేతను షుమారు రెండువేల సంవత్సరముల కాలములో జనుల కం దరికి నీశ్వరుడు మిథ్యయనియు ఐశ్వర్యమపురుషార్థమనియు సత్కర్మ లును ప్రాణాయామాది యోగనిష్ఠయు ఈశ్వరభక్తియు ముముక్షువుల కక్కరలే వనియును బాల్యమునుండి సన్యసించుట ముఖ్యకార్యమని యు పూర్వపక్ష రూపములగు బాదర్యౌడులోముల మతప్రకారము నిశ్చయరూఢిగలిగి యున్నయది సగుణరూపము నంగీకరించితే నద్వై తమవిశిపోవునని ప్రతిఘటింపుచు చాలామంది సత్కర్మాదులయెడ శి థిల ప్రయత్నులై యున్నారు.

ఇట్టి దుర్నిశ్చయమునుంచి తొలగించి తత్తద్వర్ణాశ్రమ విహిత సత్కర్మలయెందును సగుణభక్తి మొదలగు వాటియెందును శ్రద్ధగలు గజేయుటే యుపకారము బాదర్యౌడులోముల పూర్వపక్ష రూపము లగు మతములను శ్రీబాదరాయణ మహర్షి అనగ వేదవ్యాసుల వా రు సూత్రముఖముగానే జూపి యున్నారు యెట్లులనిన - సూ - అను స్మృతేర్బాదరిః - అనగ పరమాత్మకు సగుణసాకార రూపము భక్తు లయొక్క అను స్మరణ వలన గలిగినదిగాన జీవకల్పితము మిథ్యా భూతము.

సూ—కార్యం బాదరిరస్యగత్యుపపత్తేః - అనగా సగుణో పాసకులందరు ను తరమార్గమున కార్యబ్రహ్మ యనగా సమష్టి జీవ లోకమునకే బోవుదురనియు పరబ్రహ్మ నిరాకారమే గాన నందు లోకములే లేవనియు పరబ్రహ్మలో లోకాదులు భోగములు నున్నవ ని జెప్పెడి శ్రుతు లర్థవాదులనగా అప్రమాణములనియు

సూ—అభావం బాదరి రాహహ్యేవం - అనగ ముక్తుడు పర బ్రహ్మ లోకములలో దివ్యభోగాసక్తుడగునెడ నెప్పుడు దానికి విము

ఖము గానేరదు గాన నేభోగములేని విదేహముక్తి లేకనే పోవలసి వచ్చును భోగములను జెప్పెడి శ్రుతు లర్థవాదములని అనగా నప్రమాణములని జెప్పవలెననియు ముముక్షువు కర్మలతో నక్కరలేక బ్రహ్మచర్యమునుండియే సన్యసించి సదానిర్గుణ నిష్ఠచేత నిర్గుణకూటస్థ బ్రహ్మలో గలసి పోవునని బాదరి తాత్పర్యము.

సూ—చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః - అనగా చిన్మాత్రుడగు జీవుడు మరణమాత్రముచే చిన్మాత్రమగు బ్రహ్మలో గలసి పోవుటే ముక్తిగాన అంతకుమించిన భోగములెవ్వియు ముక్తున కుండవనియు దీనికి సదాచారమేల సత్కర్మలేల సత్యవచనమేల సన్యాసాదులేలనని యౌడులోమి జెప్పెడి యచలవాదము.

వీరిద్దరును శ్రుతి స్మృతుల కాభాసార్థములను కొంత గ్రహించి శుష్కతర్కములతో పై జెప్పిన మతముల ననాది కాలమునుండి జెప్పునటుల వాటిని పూర్వపక్షములుగా దీసుకుని బాదరాయణ మహర్షి వాటిని నివారించి స్వసిద్ధాంతమును జూపి యున్నాడు. ఇట్టి బాదర్యౌడులోముల మతముల ననుసరించు వారిని భగవంతుడు స్వీయగీతా - ౧౬, ౧౭, ౧౮, అధ్యాయములలో - నశౌచంనాపి చాచారోన సత్యంతేషు విద్యతే - అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయజగతో౽హితాః ఇత్యాది గ్రంథములో ఆసురసంపత్తియనియు రాజసతామసశ్రద్ధయనియు బహుదూషణతో నాక్రోశించి యున్నాడు పరిచ్ఛిన్న దేవతలను సత్యమని నమ్మి భజియించు వారికి పరిచ్ఛిన్న ఫలములు సిద్ధించినను క్రమముగా పరిపూర్ణభావము గలుగుననియు ఈశ్వరునే మిథ్యయను వారికి - నచతత్ప్రేత్యనో ఇహ - అని నిష్ఫలత్వమును వక్కాణించి యున్నాడు - తం యథాయథోపాసతే తథైవభవతి ఇత్యాది శ్రుతులును ఈశ్వరుని మిథ్యయను వారికి అటులనే ఫలించునని యాక్రోశింపుచున్నవి. పై జెప్పబడిన పూర్వపక్షమతములలో నొకటైన బాదరిమతమును శ్రీశంకరాచార్యులును ఔడులోమి మతమును అనగా నచలమత

మును శివరామదీక్షితులను వారును ఇక్కలి కాలానుగుణముగ రెం
డువేల సంవత్సరముల ఈ మధ్యకాలములో ప్రబలింపజేసి యున్నారు
ఇందువలన శ్రీబాదరాయణ వైదికా ద్వైతసిద్ధాంతము జనులకు మ
రుగైనది ఇందుచేతనే శ్రీశంకరాచార్యులు - నేశంమయా కల్పితం -
అనగా నీశ్వరుని జగత్తును నేనే కల్పించినానని బాదరిమతాను సార
ముగ విశ్వేశ్వరునకు వికటముగా నుత్తరమిచ్చుటయు - కార్యం బా
దరిః అను పూర్వపక్ష సూత్రమును సిద్ధాంతముగ దీసుకొని - అప్రతీ
కాం బన్నానయతి యను బాదరాయణ నామాంకిత సిద్ధాంత సూత్ర
ము నధికరణాంతరముగ విఘటింపజేసి చతుర్థాధ్యాయ చతుర్థపా
దములో సంకల్పాదేవతుత్ఛ్రుతేః ఇత్యాది సూత్రములు కార్యబ్ర
హ్మలోక ప్రాప్తులకణిమాద్యావిద్య కైశ్వర్యమునే జెప్పినవనియు పరబ్ర
హ్మ నిర్గుణమేగాన నచట లోకములే లేవనియు జెప్పుచు కార్యబ్ర
హ్మవైభవములో శాస్త్రపరిసమాప్తి జేసియున్నాడు భాష్యప్రారం
భములో మంగళాచరణ లేకుండ ననాత్మవాచకమగుటచే నమంగళము
గు యుష్మచ్ఛబ్దమును జేర్చి సూత్రాసంగతమై యమంగళమైన య
ధ్యాసను అనగా భ్రాంతి జానమును లక్షణప్రమాణాదులతో సర్వము
మిథ్యయని సిద్ధాంత పరుచుటకు వీలుగా గంభీర బహుగ్రంథరచనజేసి
యున్నాడు భాష్యమధ్య గ్రంథములోగూడ పరమాత్మ స్వరూపము
ద్వివిధమని జెప్పెడి శ్రుతి సూత్రములకు నిర్విశేష మొకటే పరమా
ర్థ సత్యమనియు తదితరమంతయు మిథ్యయని యసంగతార్థములనే
వ్రాసి యున్నారు.

బాదరాయణసిద్ధాంత మెట్టులనిన జూపెదము—సూ॥ అవస్థితేరితి కా
శకృత్స్నః - అనగా పరమాత్మసాకార నిరాకారోభయరూపముగా
సర్వదా సత్యమై నిత్యమైయున్నాడని కాశకృత్స్నాచార్య సిద్ధాంత
మని సూత్రకర్తస్వీకరించియున్నాడు. సూ- అప్రతీకాలంబనాన్నయతీ
తి బాదరాయణఉభయథా అదోషాత్తత్క్రతుశ్చ అనగా అహంగ్ర
హోపాసకులను విద్యుల్లోకమునుంచి పరమేశ్వరుడు తన విద్యాప్ర
పంచములోకి ఉద్ధరించుకొనుననియు ప్రతీకాద్యుపాసకులు కార్య బ్ర

హ్మలోకముకు బోయి క్రమముగా ముక్తులగుదురనియు సోపపత్తిక
ముగా సిద్ధాంతసూత్రములో తమపేరును జేర్చి వక్కాణించియున్నాడు.

సూ — ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాద విరోధం బాదరా
యణః - అనగా బ్రహ్మనిరాకారమై యున్నదనియు సాకారమైయున్న
దనియు రెండురూపములను శ్రుతులే జెప్పుచున్నవి. సాకారరూపము
లో జీవావిద్యచే నారోపించబడిన జడదృశ్యదుఃఖాదిరూపము తత్వజ్ఞా
నముచే బాధితమైనను పరమేశ్వరనిరభిసంధితుణకామనాది సిద్ధాపంచీ
కృతచిన్మయ విశ్వరూపము అబాధితమైయుండెగాన బ్రహ్మప్రాప్తిరూ
పముక్తియు జీవన్ముక్తియని విదేహముక్తియని రెండువిధములగుట
లో విరోధమేమాత్రము లేదనియు.

సూ — ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః - అన
గా ద్వాదశాహక్రతువు అహీనరూపము సత్రరూపముగా రెండువిధ
ములయినట్లుల ముక్తి సవిశేషనిర్విశేషోభయరూపముగా వచ్చునని
యు అందుకు పరమాత్మ రెండురూపములుగా నుండుటే కారణమని
యు ఈ రెండుసూత్రములు సిద్ధాంతరూపములని వాటిలో స్వనామము
నుజేర్చి వక్కాణించియున్నాడు. అనగా పరమాత్మసాకార నిరాకా
రోభయరూపుడై యున్నాడనియు అందుచేత ముక్తిగూడ సవిశేష
రూపమని నిర్విశేషరూపమని రెండువిధములని సిద్ధాంతతాత్పర్యము.

ప్రకృతములో తెనాలి వాస్తవ్యుడగు గురునాథశాస్త్రిపై
మాగ్రంథములను అనగా బ్రహ్మసూత్రతాత్పర్య దీపిక మొదలగు దీపి
కలను సాంప్రదాయకార్థములను వదలి స్వమనీషికానుసారముగ
వ్రాసితిమనియు అందుచే నప్రమాణములనియు యఃకశ్చనయతి వ్రాసి
న యర్థములన్నియు ప్రమాణము లగునాయని దూషించి యాక్రో
శించుచు నాయాశ్రుతులకును వాసిష్ఠాదిశ్లోకములకును వాటివ్యాఖ్యాన
ములను పూర్వోత్తరసందర్భమును జూపి తమరు జెప్పినవి సాంప్రదా
యికార్థములని మేము వ్రాసినవన్ని యసంగతములని వ్రాసె.

బందిపోటు వచ్చుచున్నదనిన రాకుండ మడిబట్ట నడ్డుగకట్టెదన న్నట్టుల నున్నది.

ఈ మధ్యకాలములో భాష్యకారాదులు పైజెప్పిన పూర్వపక్ష మతానుసారముగ వ్రాసిన యర్థములే సాంప్రదాయికములనుట స్థిరముగానేరదు. అంతకుపూర్వము ఋషి సంచారముగల కాలములో పారంపర్యసత్సంప్రదాయములను దెలుసుకుని సర్వజ్ఞులై బోధాయన ద్రవిడాచార్యాదులు వ్రాసిన సదర్థములు లేకపోవునా. వారినిపండితంమన్యులని ఔపనిషదంమనుష్యులని ఉపాసనాలుబ్ధులని పండితాపశదులనియు పరోక్షములో దూషించి భాష్యకారాదుల సంగతార్థములను వ్రాసినంతమాత్రమున నవి సత్సాంప్రదాయికములగునా కూలంకషవిమర్శలో నాభాసలై గాకపోవునా అట్లు క్రమముగా జూపెదము సావధానులై దెలియుడి. సజ్జనులారా ఈవిషయములో నష్టోత్తరశతోపనిషత్తులర్థవాదలంఛామనియు వాసిష్ఠము కవిత్వమంఛామని కొందరు పండితులు జెప్పుచుండిరి. బాలస్వామియను నొకనవీనుడు భాగవతము స్త్రీ శూద్రాదులకై యేర్పడినదనియు శ్రీ నారాయణతీర్థులాశ్రమ భ్రష్టులనియు వ్రాసిముద్రించినటులుండె. వీరందరూ శాంకరమత నిర్వాహకులేగదా అటులగాకుండ నీగురునాథశాస్త్రి వాసిష్ఠమును త్రిపాద్విభూతినారాయణమును ప్రమాణముగా నంగీకరించి యాగ్రంథములను సాకల్యముగా కొంత పరిశీలించి తద్వ్యాఖ్యానానురోధముకులోబడి వారుజూపిన వ్యుత్పత్తినాధారము జేసుకుని ఆయావాక్యములకుభిన్న తాత్పర్యమును నిశ్చయించుకుని మేము వ్రాసినయర్థము లసంగతములనిజెప్పె అంతమాత్రములోన సంగతములుగాబోవు గాని యాక్షేపసమాధానములలో తత్త్వముబైలుబడి లోకోపకారమగును విద్యావిద్యాప్రపంచ విభాగమే లేదని కొందరును పరమేశ్వరునకు సాకారనిరాకార రూపద్వయమే లేదురూపద్వయము జెప్పితేన ద్వైతభంగమని కొందరు.

జీవులకు బ్రహ్మమయభ్రాంతిమయజన్మలు రెండున్నవాయని కొందరు.

ముక్తిలోగూడ భోగముండునా విద్యాప్రపంచములోగూడ కుక్కలు, కోళ్ళు ఉండునాయని కొందరును విప్రతిపన్నులగుచుండిరి.

అటుల విప్రతిపత్తి జేయక గురునాథశాస్త్రి మహా నారాయణాదిసంగ్రహ తాత్పర్యమును కొంతవివరించి తనకుగల యాస్తికతను బైలుపరిచె. అందుచేత పైవారిశంకలన్నియు సమసించును. మాకదే గొప్పలాభము.

గురునాథశాస్త్రి చతుస్సూత్రీతాత్పర్యవిమర్శలో నుదహరించిన విషయములలో.

౧, ౨ విషయములు శ్రీమచ్ఛంకరాచార్య తచ్ఛిష్యవిషయక ప్రశంసత త్తత్పురాణ ప్రసిద్ధమనిన యంశములు మేము తచ్ఛిష్యపరంపరలో వారి నారాధించుచున్న వారమే గాన కాదనముగాని పురాణాది ప్రాశస్త్యం వానిరస్యతఇతివస్తుగతిః- అని మనవారు వ్రాసినందుకు చింతించెదము మతాంతరులు వీటిని ప్రక్షిప్తములని యనకమానరు. అందుకు చింతించపనిలేదు. రెండువేల సంవత్సరములనుంచి వారిప్రభావమా సేతుహిమాచలము వ్యాపించి స్థిరమైయున్నదాని నొకరు కాదన్నమాత్రముచే చెదిరిపోవునా.

శ్రౌతస్మార్తక ప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా అను పురాణవచనముకు విరుద్ధముగా. నజ్ఞులకును కాముకులకే కర్మలుగాని ముముక్షువులకును జ్ఞానులకు కర్మలుపనిలేదని శుష్కయుక్తులతో బాహాటముగా వ్రాసినందుకు గారణమేమని చింతించెదము. సన్యాసమును ముందుగా కలినిషిద్ధములలో జేర్చి మరల కొంతికాలము జరుగవచ్చునని ఋషులచే ననుజ్ఞామాత్ర మివ్వబడియున్నస్థితిలో అనన్యగతికురాలగు తల్లిని మధ్యపెట్టి సంతతివిచ్ఛేదము జేసి బ్రహ్మచర్యమునుంచి సన్యసించినది. బాదరిమతావలంబనముచేతనేగదా మాతృదేవోభవ నమాతుః పరదైవతం - ప్రజాతంతుంమావ్యవచ్ఛేత్సీః ఇత్యాదిశాస్త్రము బ్రహ్మచర్యమునుండి సన్యాసమును జెప్పలేదుగదాయనియు తల్లి జీవితకాలమంతయు గడచినరీతి చరమదశగడువదా వీరు సన్యా

సుళ్లైయుండి అట్టిచరమకార్యముకు ఘటించుకొందుకని చింతించెదము ఇవియన్నియు సీశ్వరవిలాసములే యగునా, గురునాధశాస్త్రి మా గ్రంధములలో శంకరదూషణ ఉత్తరోత్తరమధికముగా చేయబడినటుల వ్రాసెగాని మేము శంకరదూషణ యేమాత్రము జేసియుండలేదు. భాష్యత్రయములలో దోషములను జూపుట శంకరదూషణ కానేరదు.

శివం విష్ణుం గణపతిం సూర్యం దేవీంచ భైరవం ఇత్యాదిపురాణ శ్లోకములతో శంకరులు షణ్మతస్థాపన జేసినందుకు.

యాజ్ఞికనారాయణోపనిషత్తులో

౧ పురుషస్యవిద్మసహస్రాక్షస్య మహాదేవస్య ధీమహితన్నో రుద్రః ప్రచోదయాత్ అని పురుషసూక్తాది ప్రతిపాదిత పరమప్రధాన సర్వాత్మక పరమేశ్వరోపాసనయు.

౨ తత్పురుషాయవిద్మహే మహాదేవాయధీ మహితన్నో రుద్రః ప్రచోదయాత్ ఇత్యాది గుణమూర్తులయొక్క ఉపాసనయునావశ్యకమని జెప్పియున్నది వాటినేస్థాపించియున్నారు. గాని ఇట్టివారు భాష్యములో నిర్గుణకూటస్థమొకటే సత్యము తదితరసవిశేషమంతయు మిధ్యయని శ్రుతిసూత్రముల కర్థముల నేలకల్పించిరని చింతించితిమి. పది శైవపురాణములను నాలుగు వైష్ణవపురాణములను ఆదిత్యాదిపురాణములను పదునెనిమిదిటిని రచియించిన బాదరాయణులకు శివవిష్ణ్వాది మూర్తులు మిథ్యయని తాత్పర్యము కాదుగదా.

అఖండానందసర్వస్వంమహః ఖండేందుశేఖరం జీయాత్తదాప నిషదంసచ్చిత్సుఖమునూసఖం - అని గురునాధశాస్త్రిచే గ్రంధారంభములో స్మరించబడిన మూర్తిః పరమార్ధసత్యమగునా కాదాయనిన మణిప్రభామణిభ్రాంతిః అని విద్యారణ్యస్వామి జెప్పిన వచనమును బట్టి నాగరికముగముందు మిధ్యయని సూచించబోవుచుండెజూడుడి. భాష్యకర్తభాష్యత్రయములో వ్రాసిన దురుక్తములు మేమువ్రాసిన దీపికలలో నపాక్షికబుద్ధిచే జూచువారికి తెల్లమిగాగలవు.

ఈశ్వరావతారులైన శంకరులిటుల నేల వ్రాసిరని విచారించగా ప్రథమవయస్సు ముఖ్యకారణమై యున్నటుల దోచవచ్చు ఉత్తరవయస్సులో బాధకము గనుపడినకాలములో శివశ్శక్త్యాయుక్తోయది భవతిశక్తః ప్రభవితుం లక్ష్మీనృసింహమ మదేహికరావలంబం దక్షిణామూర్తిమీడే సర్వాత్మత్వమితిస్ఫుటీకృతమిదం సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యాదీశ్వరత్వంస్వతః - నిరాకారం క్వాపిక్వచిదపిచసాకారమమలంనిజంశైవం రూపం ఇత్యాది బహుస్తోత్రములలో శంకరాచార్యులే పరమాత్మకు సవిశేషనిర్విశేషోభయరూపమును జెప్పి బహుప్రపత్తి జేసెగదా నేశంమయాకల్పితం అన్నమాటకును ప్రణంతుం స్తోతుంవాకథమకృతపుణ్యాః ప్రభవతి అనిసమాటకును గలవై లక్షణ్యాము నాలోచించుడి. ఇటులవ్రాయుటకు మరివేరే కారణములేమియుండునని విచారించగా వృద్ధబ్రాహ్మణవేషముతో సన్నిధినిచ్చిన వ్యాసులవారినిన్ని చండాలవేషముతో సన్నిధినిచ్చిన విశ్వేశ్వరుని శంకరులు దెలియజాలకపోయిరని పదునెనిమిది పర్యాయములు సూతసంహితను జూచి భాష్యములను రచియించిరనియు మనవారు జెప్పిన మాటలచేత శంకరులకు అజ్ఞానము రాగద్వేషములు పరతంత్రప్రజ్ఞతా గలిగియున్నటుల దెలియవచ్చినదనిన శంకరదూషణ జేసినటులనగునా అగునెడ నట్టివచనముల నిర్మించినవారిదా వాటితాత్పర్యమును గనుపెట్టినమాదావిచారించుడి,

దోషములను జూపునప్పుడు కుళ్లు గుమ్మడికాయ విధముగను అపార్థములను యుక్తియుక్తముగ బోధించునప్పుడు గోముఖవ్యాఘ్రముగను వర్తించు వారికి సమర్పకముండదు గురునాధశాస్త్రి త్రిపాద్విభూతి మహానారాయణమును బాగా విమర్శించి అధ్యాయాష్టకముకును సంక్షేపతాత్పర్యమును జూపి అందులో విద్యా విద్యా ప్రపంచ విభాగమున్నదని జెప్పి మేము దాని ప్రకారము పాదచతుష్టయమును జెప్పక వేరు విధముగా జెప్పితిమని యాక్షేపించె

శ్రుతులలో ఒకచోట నిర్గుణకూటస్థ రూపమును త్రిపాద్విభూతిగాను సగుణసవిశేష విద్యాప్రపంచము నేకపాద్విభూతిగాను

ఈ మహానారాయణములో నిర్గుణరూపమును జెప్పకుండా త్రిపాద్విభూతి విద్యాప్రపంచమని యవిద్యాప్రపంచ మేకపాద్విభూతి యని ఏకపాద్విభూతిలోనే యవిద్య యున్నదని త్రిపాద్విభూతిలో లేద ని ఇది అనగా విద్యాప్రపంచము పరమార్థసత్యమని ఇచ్చట సావ యవత్వాది దోషములు జెప్పరాదని జెప్పినటుల తానే వ్రాసె

మరియొక శ్రుతిలో పరమాత్మకు చరాచర పదార్థములు రూపద్వయమని జెప్పియున్నది

అన్యత్ర - మూర్తామూర్తములు రూపద్వయమని జెప్పబడి యున్నది.

మరియొక శ్రుతి పరమాత్మచే బుద్ధిపూర్వకముగ తనయందు మృదాదులయందు ఘటాదులనువలె కల్పించుకున్న విద్యాప్రపంచము పరమార్థ సత్యమొక రూపమనియు దానియందు సమష్టివ్యష్టి జీవ వేషముతో భ్రాంతిచేత రజ్జువుయందు సర్పమునువలె కల్పించుకున్న యవిద్యాప్రపంచమొక రూపమనియు - ద్వేవావబ్రహ్మణోరూపే ఇ త్యాది శ్రుతులె బోధించి భ్రాంతి సిద్ధమును బాధించి సర్వాత్మకమగు సవిశేష నిర్విశేషోభయరూపము భ్రాంతి సిద్ధముగాక బుద్ధిపూర్వకమై నందున పరమార్థ సత్యమని పరిశేషింపు చున్నది. వాటిలో నిర్గు ణకూటస్థ రూపమును త్రిపాద్విభూతిగను సగుణసవిశేషరూపము నేక పాద్విభూతిగను మేము జెప్పినప్పుడు విద్యా విద్యా ప్రపంచములు రెండున్నవాయను శంకకు మహానారాయణాదులలో జెప్పియున్నవని వ్రాసినది యాక్షేపార్హమగునా.

గురునాధశాస్త్రి - ఏవమత్రసర్వసం ప్రతిపన్నే భగవత్పాదీ యావతారే - శాస్త్రసిద్ధాంతే కశ్చనాద్వైతానంద తీర్థస్వామా-అ ని వ్రాసెగాని సర్వసం ప్రతిపత్తిని జూపలేదుగదా సవ్యాఖ్యాన భా ష్యమును వైశ్వానర ప్రీతిజేసి నవారును మతాంతరములకు జేరినవారు ను సంప్రతిపత్తి జేయలేదుగదా

గురునాథశాస్త్రి మహానారాయణ తాత్పర్యమును వివరించిన దానిలో.

ప్రథమాధ్యాయములో పాదచతుష్టయమును జూపి అవిద్యాపాదమందే మూలావిద్యా విలాసమనియు తక్కిన మూడు పాదముల యొంద విద్యాసంపర్కములేక బ్రహ్మరూపమై పరమార్థ సత్యమై యున్నదనియు.

రెండవ అధ్యాయములో పాదత్రయాత్మక బ్రహ్మసాకారమై సావయవమై తేయ నిత్యముగాదా యను శంకకు సాకారము సోపాధికమని నిరుపాధికమని రెండు విధము లున్నది అందులో సోపాధిక మవిద్యాప్రపంచమే దానియొందే సావయవమని అనిత్యమని శంకలుగాని నిరుపాధికసాకార విద్యాప్రపంచమందు దీ శంకలు జెల్లవనియు చిదున్మేష నిమేషములచే మూలావిద్యా వ్యక్త్యాదు లావిర్భవించుచు తిరోధానమగుచుండు ననియు.

మూడవ అధ్యాయములో ప్రపంచము విద్యాప్రపంచమని అవిద్యాప్రపంచమని రెండు విధములు పూర్వోక్తపాదత్రయాత్మక విద్యాప్రపంచము చిన్మయముగాన పరమార్థ సత్యమనియు అవిద్యాప్రపంచ మవిద్యాధీనమైన యావిర్భావ తిరోభావములచేత ననిత్యమనియు

స్థూలాభిమానియగు విరాట్టుకు సూక్ష్మరూపుడైన హిరణ్యగర్భనిలోను నతనికి కారణమగు నవ్యక్తములోను సర్వజీవవర్గ సహితముగల యమనియు అట్టి స్థితిలయములకుగల కాలపరిమాణమును జెప్పి అవ్యక్తము త్రిపాద్బ్రహ్మలో లయించుననియు అట్టి త్రిపాద్బ్రహ్మకు మాయోపాధివశముచేత సగుణపరిచ్ఛిన్నాది ప్రతీతియు ఉపాధిలయములో నిర్గుణనిరవయవాది రూపముగ పరిశేషించుటయు జెప్పబడినదని వ్రాసె అది యంతయు వాస్తవమేగాని త్రిపాద్విభూతిపతౌ విద్యాప్రపంచాత్మనియన్న చోట (నిర్విశేషే బ్రహ్మణి) యన్నమాట

యును మూలావిద్యా మాయయోరభేదాభిప్రాయేణ అన్నమాటయు శ్రుతిలో జెప్పినవి గావు. వీరు కల్పించినవి-

నాలుగవ అధ్యాయములో నిర్విశేష చిన్మాత్రబ్రహ్మ విదేహ ముక్తిలో పరిశేషించునది (బ్రహ్మణః పాదచష్టయమతి శుద్ధంభవతి నిర్విశేషం భవతి) అని జెప్పబడి యున్నది నిర్విశేషమే తమసః పరస్త నమని జెప్పలేదు. వీరు కల్పించిరి-

పంచమాధ్యాయములో వర్షాకాలారంభములో కప్పలు పుట్టిన చందమున ఉష్ణకాలములో తిరుగ అవిద్య ఉదయించి జన్మాంతర దుష్కర్మవాసనలచే వారికి సంసారాను సరణమనియు సాధుసంగమ సద్గురు కరుణాకటాక్షము వలన భగవద్భక్తి ధ్యానాదులయెడ శ్ర గలిగి అందువలన హృదయగ్రంధిభేదమై భగవత్సాక్షాత్కారమగుననియు దేహావసాన కాలములో మూర్ధన్యనాడితో బయలు వెళ్లి లింగ శరీరముతో అర్చిరాది మార్గమున ఆయాపుణ్యలోక దర్శనమై విరజాతరణానంతరమందు లింగదేహ భంగమై విద్యాప్రపంచములో విరాట్కైవల్య ప్రాప్తులగుదురని.

షష్ఠాధ్యాయములో - విష్ణుమాయావిలసితానంతకోటిబ్రహ్మాండాంతర్బహిః ప్రపంచరహస్య విజ్ఞాన పూర్వకముగా ముక్తులకు మహావిరాట్పద ప్రాప్తియై బ్రహ్మవిద్యా వైకుంఠాది వివిధవైకుంఠ విలాసమును అచ్చటనుండెడి వారిచే వీరికి మోక్షసామ్రాజ్య పట్టాభిషేకము జెప్పబడినదని

సప్తమాధ్యాయములో మహానారాయణ యంత్రము సవిస్తరముగా జెప్పబడి అచ్చటి చిదానందమయ ప్రాకార ప్రాసాద విమానాద్యనంత పదార్ధములను జెప్పి దాని కర్ణికామధ్యము నధిష్టించియుండు ఆత్మస్వరూపుడగు త్రిపాద్విభూతి నాయకుండు అద్వైత పరమానంద రూపునిగా ధ్యానించుమని జెప్పియున్నదని

అష్టమాధ్యాయములో సువర్ణము కటకమకుటాద్యాకార భేదమైన
టుల జలము తరంగబుద్బుదాది భేదమై విలసించినటుల నద్వయబ్రహ్మ
కు వెనుక జెప్పిన ప్రాకారాది భేదము జెప్పబడెగాని వస్తుస్వరూప
ములో అట్టి భేదము లేదని బ్రహ్మవిద్య సమాప్తి జేయబడినదనియు

ఇదిగాక వెనుక జెప్పిన ద్వితీయాధ్యాయములో సాకారము
సోపాధికమని నిరుపాధికమని రెండువిధములనియు ఆవిద్యకమైన నిఖిల
కార్య కారణజాలము అవిద్యాపాదములోనే ననియు విద్యాపాదము
లో లేదనియు అవిద్యోపాధి సాకారమంతయు సావయవమైననియు అం
దుచేత ననశ్యముగాన నిత్యమేయగు ననియు నిరుపాధికసాకారము బ్ర
హ్మవిద్యా సాకారమనియు ఆనందసాకారమనియు ఉభయాత్మకసాకా
రమనియు ముత్తెరంగులనియు యిట్టి త్రివిధసాకారము మరల ద్వివిధ
ముగా నిత్యసాకారమునియు ముక్తసాకారమని యగుననియు అందులో
నిత్యసాకార మాద్యంతములు లేని శాశ్వతమనియు ఉపాసనచే ముక్తి
కి పోయిన వారికి ముక్తసాకారమనియు అందుచేత పరబ్రహ్మకు సా
కార నిరాకారములు పరమార్థముగా స్వాభావసిద్ధములని కూడజెప్పి
యున్నదనియు.

తృతీయాధ్యాయములో ప్రపంచము విద్యాప్రపంచమని య
విద్యాప్రపంచమని రెండువిధములు. అందులో విద్యాప్రపంచమునకు ని
త్యానందచిద్విలాసాత్మకముగుటచే నిత్యత్వము సిద్ధమేననియు అష్టమా
ధ్యాయములో శుద్ధమైన సువర్ణముకు కటక ముకుటాంగదాది భేద
మువలె అద్వైతపరమానంద లక్షణబ్రహ్మనైన నాకు ద్వైతమంతయు
ఉపపన్నమేయగును. నాస్వరూపమేయగునని జెప్పియున్నటుల గురు
నాథశాస్త్రి వ్రాసి ఉపనిషత్తుకంతయు నిష్కృష్టతాత్పర్యమును ఉప
క్రమోప సంహారముల నాలోచించగా బ్రహ్మకు సాకారనిరాకారత్వ
ములు స్వాభావికములైనను సువర్ణముయొక్క కటకముకుటాద్యా
కార విలాసము విలాసిజనమనోరంజనార్థమైనటుల ఉపాసకుల నను
గ్రహించుట కాత్మేచ్ఛచేత అనగా మాయేక్షణాది లక్షణనిరభిసంధి

సంకల్పముచేత నిరాకారస్వరూపముకంటె భిన్నముగా లక్ష్మీనృసింహ
దక్షిణామూర్తి వైభవాదులని జెప్పబడిన నిత్యసాకారవిలాసమును
ప్రకాశింపజేయుచున్నదని జెప్పి ఇట్టి నిత్యసాకారమైచ్ఛికమగుటచే నా
విర్భావతిరోభావములతోన నిర్వచనీయత్వలక్షణ మిథ్యాత్వమనియు
నిరాకారమునకుపారమార్థికత్వమనియు ఉపనిషద్గంభీర తాత్పర్యము
భగవత్పాదశంకరాచార్యాద్యభి మతమనియు స్వభావమునకుగూడ ని
మిత్తముగలిగితే కార్యరూపముగా విలసించి నిమిత్తము శమించితే
నాత్మరూపము గాలయించునని లోకానుభవమున్నదని దానికి వాసిష్ఠ
వచనములను సంవాదముగా వ్రాసె

ఇంత ఘోరకలి మరియొకటున్నదా ముక్తసాకారముకన్న నధి
కనిరతిశయనిత్యపరమార్థ సత్యమని పై యధ్యాయములలో జెప్పిన
నిత్యసాకారమైచ్ఛికమగుటచే నావిర్భావతిరోభావములుగలిగిన మా
త్రమునను అనిర్వచనీయత్వలక్షణమిథ్యాత్వమనియు నిరాకారమునకు పా
రమార్థికత్వమని యుపనిషద్గంభీర తాత్పర్యమని జెప్పి భాష్యకా
రాభిమతమును సమర్థించుచున్నాడు జూడుడి.

పరస్మాత్పరి నిర్యాతా బ్రహ్మ విష్ణుహరాదయః - కణా స్తప్తా
యస ఇవ వారిధేరివ బిందవః - బ్రహ్మవిష్ణుహరాదీనాముయోయం పరమఃపి
తా - అని ఉదహరించిన వాసిష్ఠశ్లోకములో గూడ బ్రహ్మాదులకు మి
థ్యాత్వమును జెప్పలేదుగదా. భాష్యము మొదలు గౌడబ్రహ్మానందీ
కల్పతరు పరిమళాది గ్రంథములలో నెక్కడను ఉత్తరమార్గమున వెళ్ళి
నవారికి విద్యాప్రపంచరూప పరమేశ్వర ప్రాప్తిజెప్పబడలేదుగదా
కార్యబ్రహ్మలోక ప్రాప్తినేజెప్పిరి. పరబ్రహ్మ లోలోకములే లేవని
జెప్పిరి. సాకారమే లేదనిరి. ముక్తుడు దేహపాతమైన తోడనే నిర్గుణ
కూటస్థబ్రహ్మలో గలసిపోవునని జెప్పిరి. ఈ చెప్పుట బాదర్యాదులో
ముల పూర్వపక్షమతముల ననుసరించినదేకదా.

ఈ యుపనిషత్తులో నిత్యసాకారము ముక్తసాకారము ప్రాకా
ర గోపురాదుల సహితముగ విద్యాప్రపంచమంతయు పరమార్థస

త్యమనియు అవిద్యోపాదము సావయవము సోపాధికసాభిసంధిగానయు నిత్యమని జెప్పబడె.

నిరవయవనిరభిసంధి కల్పితమగుటచే పరమార్థ సత్యమనియు నిరవధికనిత్యమనియు శ్రుతిచే కంఠోక్తిగా జెప్పబడిన విద్యాప్రపంచము ఐచ్ఛికమను యుక్తిచేత నావిర్భావతిరోభావములుండుటచేతను అనిర్వచనీయమిథ్యాత్వమనుట భ్రాంతికాదా.

ఆవిర్భావతిరోభావములు రెండువిధములు విద్యాప్రపంచములో పటవచ్చయను న్యాయసూత్రప్రకారము సంవేష్టితచిత్రపటములోవలె వస్తుభేదమంతయు కానరాకుండనుండుట తిరోభావము ప్రసారితచిత్రపటములోవలె వస్తుభేదమంతయు స్ఫుటముగా గనుపించుటయావిర్భావము ఇందుచే వస్తుభేదమంతయు సర్వదా చిన్మయమై కారణాత్మనా ఉండనేయున్నది.

అవిద్యాప్రపంచములో నావిర్భావతిరోభావములు అటులగావు. రజ్జువుయెందు సర్పమువలె కాలత్రయమందు లేకనేయున్నటుల భ్రమకాలములోదోచి విమర్శలో లేకపోవుట.

విద్యాప్రపంచములో విద్యానందాది సాకారములనియు నిత్యసాకారముక్త సాకారములనియు ప్రాకార ప్రాసాదాదులనియు అన్నియు చిన్మయములేననియు పరమేశ్వరనిరభిసంధిసంకల్పకల్పితములనియు వాటిని మేము భూతభౌతికములని జెప్పినామని గురునాథశాస్త్రి యాక్షేపించె. సోకామయత బహుస్యాంతద్తైక్షతత త్తేజోఽసృజత- ఆత్మావాఇదమేక ఏవాగ్రఆసీత్ సఈక్షత లోకాన్నుసృజాఇతి ఇత్యాదిసృష్టిశ్రుతులుజెప్పిన ఈక్షణాదిప్రవేశాంతసృష్టియంతయు పైజెప్పిన విద్యాప్రపంచమేగదా అవియపంచీకృతచిన్మయ భూతభౌతికములేగదా అవి జడములను భ్రాంతిచేత భూతభౌతికములన్నామని మమ్ములనాక్షేపించుటగదా.

లోకవత్తులీలాకైవల్యం అను సూత్రప్రకారము పరమేశ్వర

ప్రథమేతుణ సిద్ధవిద్యాప్రపంచమంతయు కేవలలీల అనగా నిరభిసంధి సంకల్పకల్పితము అందుచేత పరమార్థసత్యము దానికి అవిద్యాస్పర్శ లేదు. అందుచేత మిథ్యయనగూడదు.

అవిద్యాప్రపంచము జీవావిద్యాసిద్ధము పరమాత్మయందవిద్యను జెప్పరాదు. నిత్యం శుద్ధం బుద్ధం సర్వజ్ఞం సర్వశక్తియని శ్రుతులు జెప్పుచున్నవి. అవిద్యాసిద్ధమై తత్వజ్ఞానబాధ్యమగుటచేత మిథ్యయని జెప్పబడును.

అపంచీకృతచిన్మయాకాశాదులయందు భూతశబ్దము భూసత్తాయాం అను వ్యుత్పత్తిప్రకారము సత్యములను తాత్పర్యముచేత ప్రయోగింపబడుచున్నది. శ్లో॥ జాతశబ్దోహిసన్మాత్ర పర్యాయశ్శ్రూయతాంకథం - ప్రాదుర్భావేజనిస్తూక్తః ప్రాదుర్భావస్య భూర్వపుః - సత్తార్థఏవభూః ప్రోక్తస్తస్మాత్సం జాతముచ్యతే - సగర్భోజాతఇత్యుక్తేసన్ సగర్భఇతి శబ్దితం అని వాసిష్ఠవచనము.

అవిద్యాప్రపంచములో పంచీకృత జడదుఃఖనిరోధకపృథివ్యాదులయందు భూతశబ్దము భూతములు గ్రహములు పిశాచములను తాత్పర్యముతో ప్రయోగించబడుచున్నది.

శ్రు—అష్టౌగ్రహాః అష్టావతిగ్రహాః అని శ్రుతిజెప్పుచున్నది గదా.

ఇదేరీతి మాయాశబ్దముగూడ పరమాత్మయందు జెప్పినప్పుడు లౌకికస్థలములలో జెప్పినటుల భ్రమయని యవిద్యయని దబ్బరయని బూటకమను తాత్పర్యముతో జెప్పబడదు. మరేమన పరమార్థసత్యమగు పరమాత్మప్రకృతియను తాత్పర్యమని శ్రుతియే మాయాంతుప్రకృతిం విద్యాన్మాయినంతుమహేశ్వరం అని వివరింపుచున్నది. మనవారు వేరు తాత్పర్యములను జెప్పుచున్నారు జూడుడి.

భాష్యకారాదులీ మహానారాయణము నర్థవాదక్రింద త్రోసి

వైచి నేకసర్వజగన్మిథ్యాత్వమును జెప్పిరిగాని గురునాథశాస్త్రి జూపిన తాత్పర్యముచేతగాదు.

ద్వితీయాధ్యాయములో చిదున్మేషనిమేషాదులచే మూలావిద్యాఽవ్యక్తాదులావిర్భవించుచు తిరోధానమగుచుండునని జెప్పిన చిత్తుబ్రహ్మచైతన్యముగాదు జీవచైతన్యమే భ్రమయేల బ్రహ్మచైతన్యమని యెవరుజెప్పిరంటివా వినుము.

యదవిద్యావిలాసేన భూతభౌతికసృష్టయః - తన్నామిపరమాత్మానం సచ్చిదానందవిగ్రహం అనియు ఆశ్రయత్వవిషయత్వభాగినీ నిర్విభాగచితిరేవ కేవలా - పూర్వసిద్ధతమసోహిపశ్చిమో నాశ్రయోభవతి నాపిగోచరః - అనియు వార్తికకారాదులే జెప్పిరి. యెవరికవిద్య యెక్కడనవిద్యయంటె పరమాత్మకే ఆవిద్య పరమాత్మయందే యవిద్యయని యుక్తిపురస్సరముగా సూర్యునియందు చీకటిని జెప్పునటుల నిత్యం శుద్ధం బుద్ధం ముక్తం సర్వజ్ఞం ఇత్యాదిశ్రుతికి విరుద్ధముగా పరమాత్మయందున్నదని జెప్పితే సాంప్రదాయికమగునా.

పంచమాధ్యాయములో చిదున్మేషనిమేషములచేన విద్యాప్రపంచ మావిర్భావతిరోభావములను జెందుననిజెప్పె అట్టిచిత్తుసమష్టి జీవచైతన్యముగాదా మూర్ధన్యనాడీద్వారా నిర్గతులు లింగదేహాభంగమై విద్యాప్రపంచములో విరాట్కైవల్యప్రాప్తులగుదురని శ్రుతిజెప్పె మనభాష్యకారాదులు బాదరిమతాను సారముగా కార్యబ్రహ్మ అనగా సమష్టిజీవలోకప్రాప్తినే జెప్పిరి. తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మగమయతియను శ్రుతిలో పరమేశ్వరవాచకమైన తత్పురుషశబ్దమును ఆమానవశబ్దమును గణనజేయక జైమినిజూపిన సద్ధేతువులను ద్రోసివైచి బాదరాయణసిద్ధాంతసూత్రమును విఘటనజేసి బాదరిమతమునే సిద్ధాంతపరిచిరి.

షష్ఠాధ్యాయములో జెప్పిన యొక యంశమునయిన మనభాష్యాదులలో జెప్పరైరి.

సప్తమాధ్యాయములో జెప్పిన వైభవమును ముక్తికింద జేర్చకపోయిరి.

అష్టమాధ్యాయములో విద్యాప్రపంచమునకు సువర్ణకటకజల తరంగాది దృష్టాంతములనిచ్చె. అవిద్యాప్రపంచమునకు మరుజలాది దృష్టాంతములు సర్వత్ర జెప్పబడుచుండె.

ఇట్టిస్థితిలో గురునాథశాస్త్రి మా గ్రంథములలోని ప్రక్రియల నాక్షేపించుట యెంత ప్రామాణికమో జూడుడి.

చతుర్థాధ్యాయములో బ్రహ్మయందు పాదభేదాదులను జెప్పుచూ అద్వైతమనుట యెట్లులని శంకించితే పాదభేదములను జెప్పితిమిగాని బ్రహ్మభేదమును జెప్పలేదుగదా? పాదభేదములను జెప్పుట బ్రహ్మస్వరూపమును జెప్పుటకని కల్పితభేదము పారమార్థికాద్వైత భంజకముకాదని సూచించెగాని విద్యాప్రపంచగతభేదమునకు మిథ్యాత్వమును జెప్పదయ్యె బుద్ధిపూర్వకమగుటచేత మిథ్యగాబోదుగదా.

గురునాథశాస్త్రి—ఉపక్రమాది లింగబలముచే నీయుపనిషత్తునకు నిర్విశేషబ్రహ్మయందే తాత్పర్యమని అందుకు సలిలములో తరంగాదులవలె పూర్వోక్తప్రాకారాది భేదమంతయు కల్పితముగాని వస్తుస్థితిలో లేదని (అతఏకమేవాద్వయం బ్రహ్మేత్యుపదిష్టం భవతీతిగమ్యతే) ఇత్యాద్యభిప్రాయములు వ్రాసె అందుచేత సవిశేషము మిథ్యయనిగదా యభిప్రాయపడి వ్రాసినది ఇది ఘోరకలిగాదా దుగ్ధోదధిమధ్యస్థితామృతకలశవత్ - సుదర్శనమధ్యతే జోంతర్గత సుదర్శనపురుష ఇవ సూర్యమండలాంతర్గత సూర్యనారాయణ ఇవచ సర్వగత నిరాకార మహావాయుగత త్వక్ప్రతిభూత సాకారవాయుదేవఇవ ఇత్యాది బహు దృష్టాంతములతో శ్రుతి ౧, ౨, అధ్యాయములలో సర్వాత్మకుడైన పరబ్రహ్మకు సాకార నిరాకార భేదవిరోధము లేదని వివిధవిచిత్రానంత శక్తిగల పరబ్రహ్మకు స్వరూప జ్ఞానములో లోపములేదనియు జీవులకువలె స్వరూప జ్ఞానము లోపించితే అన్ని విరోధ

ములు సంభవించునని అనగా బుద్ధిపూర్వ కల్పితమగుటచే భేదమంత యు సత్యమని సూచించెగదా.

పరబ్రహ్మకు సాకారత్వము పరమార్థమై లేక నిరాకారమె కదేయని జెప్పెడల కేవల నిరాకార బ్రహ్మకు ఆకాశమునకువలె జడత్వమే యాపాదించును అందుచేత పరబ్రహ్మకు సాకార నిరాకారములు పరమార్థముగా స్వభావసిద్ధములని శ్రుతి వక్కాణించినది అన్యత్ర - ఈశావాస్యోపనిషత్తులో ఈశావాస్యం అని పరమేశ్వరుని అనగా సగుణబ్రహ్మ నుపక్రమించి అనేకదేకం మనసోజవీయః-తదేజతితన్నైజతి యని మధ్యయందు సాకార నిరాకారములను పరామర్శ జేసి - సపర్యగాత్ - యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యస్స మాభ్యః అని సవిశేషములోను పసంహారము జెప్పి యస్తుసర్వాణి భూతాని - యస్మింత్సర్వాణి భూతాని యని రెండు మంత్రములతో సర్వభూతములును ఆత్మాభిన్నములై యుండునని అందుచేత జ్ఞానికి జుగుప్సాశోక మోహాదులుండవని ఫలమును జెప్పినది - ఛాందోగ్యాష్టమ ప్రపాఠకములో - యఆత్మాఽపహతపాప్మా - సత్యకామస్సత్యసంకల్పః అనిసగుణబ్రహ్మ నుపక్రమించి సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః అని - సగుణబ్రహ్మనే వెతుకుకొనమని తెలసుకోమనియు విధించి - ససర్వాన్ లోకానాప్నోతి సర్వాగ్శ్చకామాన్ అని ఫలమును జెప్పి యున్నది భగవద్గీతలలో - సాధిభూతాధి దైవం మాంసాధియజ్ఞం చయే విదుః అని యుపక్రమించి - అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతం - అధియజ్ఞోహమేవాత్రయని మధ్యగ్రంథములో సవిస్తరము నిరూపించి అవసానములో - యస్మాత్ క్షరమతీతోహామ క్షరాదపిచోత్తమః అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః అని ఉపసంహరించబడి యున్నదిఇటుల శ్రుతి స్మృతులలో నంతటను సగుణ సవిశేషబ్రహ్మయందే ఉపక్రమాదులచే విశేషముగా తాత్పర్యము గనుపడు చుండగా - సదేవసోమ్యేదమగ్రఆసీత్ - ఆత్మావాఇదమేక ఏవాగ్రఆసీత్ - ఇత్యాది సృష్టి వాక్యములు సృష్టికి పూర్వావస్థలో బ్రహ్మసజాతీయాది భేదములు లేక నిర్గుణసత్తా సామాన్య రూపమై

యుండెనని జెప్పిన మాత్రముచేత శ్రుతులకు నిర్గుణమందే తాత్పర్య మని సగుణమంతయు మిధ్యయని జెప్పుట ఘోరకలికాదా ఉత్తర గ్రంథములో సిరభిసంధీక్షణకామనాది సృష్టమైనటుల జెప్పబడిన యశేష విశేషములు మిధ్యయగునా.

సుషుప్తివాక్యములును విదేహముక్తి వాక్యములు నిర్విశేష మును జెప్పిన మాత్రముచేత నైనా నిర్విశేషమందే తాత్పర్యమని జెప్పవచ్చునా విచారించుడి.

మాయాహ్యేషా మయాసృష్టా అను వాక్యములోగూడ మాయాశబ్దముచేత మాయాంతు ప్రకృతిం విద్యాత్ అను శ్రుతి నిర్వచన ప్రకారము సర్వభూతగుణైర్యుక్తం అని భూతగుణములే జెప్పబడె గదా అన్యత్ర - ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా అని జెప్పిన రీతుగా మాయ యనగా అష్టధాభిన్నమగు నపరప్రకృతే ఇట్టి స్థితిలో జన్మకర్మ చమేదివ్యం అను భగవద్వాక్యమును మరచి మిథ్యాత్వ తాత్పర్యము జెప్పుట భ్రాంతి గాదా ఇట్టి స్థితిలో గురునాధశాస్త్రి తన గ్రంథము ౧౦, ౧౧ పుటలలో మహానారాయణోపనిషత్తాత్పర్యము అనంతరూపములతో విలసించుచు సవిశేష నిర్విశేషోభయ రూపమైయున్న బ్రహ్మను ప్రతిపాదించినటుల నెనిమిది అధ్యాయముల తాత్పర్యమునను వదించి - విశేషములన్నియు ఉపాసనార్థ కల్పితములని - (అతఏకమేవాద్వయంబ్రహ్మేత్యు పదిష్టంభవతీతిగమ్యతే) అని వ్రాయుటయు (తద్విపర్యయేణ విషయిణస్తద్ధర్మాణాం చవిషయే అధ్యాసోమిథ్యేతి) జీవాధ్యాసను జెప్పెడి భాష్యతద్వ్యాఖ్యానముల నుదహరించుటయు భ్రమగాదా భాష్యములో వర్ణించిన యధ్యాస స్వరూపజ్ఞానము లేని జీవులయొక్క భ్రాంతిరూపము మహానారాయణములో జెప్పిన విశేషములన్నియు సర్వజ్ఞ బుద్ధి పూర్వ కల్పితములు పరమార్థ సత్యములు పురుషార్థ రూపములును గదా

గురునాధశాస్త్రి పరమహంస లాత్మతంత్రులని యుపహాసించెపండితులు పూర్వపక్ష భూతబాదరిమత పరతంత్రులని జెప్ప నక్కర లేదుగదా

గురునాథశాస్త్రి జీవులకు బ్రహ్మజ భ్రాంతిజ సంభవములను వాసిష్ఠవచనములను బట్టియంగీకరింపుము బ్రహ్మజసంభవము పూర్వసిద్ధమై పురుషార్థరూపమై భ్రాంతి జసంభవమనర్థ రూపమై యుండగా మదీయ బ్రహ్మసూత్ర తాత్పర్య దీపికా ప్రథమ సూత్రార్థ వివరణోపోద్ఘాత నాక్షేపించుట నిరాస్పదము సమష్టిజీవునకు భ్రాంతి జసంభవము లేదనియు లేనిదానిని మేము జెప్పినామని వాటి వ్యాఖ్యానానుసారముగ నాక్షేపించెగాని యీవ్యాఖ్యానమును దానిని బట్టి గలిగిన తమవ్యుత్పత్తియును భయము భ్రాంతి రూపమే యెట్లులనిన పూర్వసిద్ధతనుసోహం పశ్చమో నాశ్రయోభవతి నాపిగోచరః అను వార్తిక భ్రాంతి వచనప్రకారము పరమాత్మకే యవిద్య గలిగి దానివలన జీవులందరూ వివర్తించినవారైతే జీవులు సంపాదించిన తత్త్వజ్ఞానము వలన బ్రహ్మగతమైనయవిద్య నివర్తించునా నివర్తించితే సర్వమోక్షమే గావలసెగదా అనాదిభాసమునకు నివృత్తి గలుగునా గలిగేయెడల బ్రహ్మకుగూడ నివృత్తి గలుగును ఇత్యాద్యాక్షేపములను మనస్సులో బెట్టుకొని శ్రీరాములు ప్రాణినామి హాసర్వేషామిత్యాది ప్రశ్న జేసె అన్నిశంకలు పరిహారముగ నటుల వసిష్ఠులవారు బ్రహ్మాదీనాంత్రుణాంతానామిత్యాది శ్లోకత్రయముచే నుత్తరమిచ్చిరి.

బ్రహ్మాదులకు రెండు విధముల సంభవముగుచున్నదని కంఠోక్తిగా జెప్పినచో బ్రహ్మ అనగా సమష్టిజీవునకే భ్రాంతి సంభవము లేదనుట నిత్యముక్తుడనుటయు వివర్తోపాదానాంశే పరిణామ్యుపాదానాంశే అనుటయు ఆదిమసృష్టి ప్రసంగములో పూర్వాంతదోన్యను భవరూపయాతద్వైహతాదాత్మ్య దృఢభ్రాంత్యా అనుటయు ఏతేభ్యో భూతేభ్యస్సముత్థాయేత్యాది తత్తజ్జీవ దేహత్యాగకాలీనోత్థానాది ప్రతిపాదక శ్రుత్యుదాహరణమును నిత్యముక్త బ్రహ్మణః కదాప్యభాతాయామేవ జగద్భ్రాంతౌ స్వయమేవ వివర్తతయా సర్గాదౌ జీవభావేన భవన్ ఇత్యాది గ్రంథమంతయు తెలసి వ్రాసిన గ్రంథమా తెలియక వ్రాసిన తడకేనా ? విచారించుడి.

బ్రహ్మయందజ్ఞానములేదని శ్రుతులు చెప్పుచుండె. యుక్తి యుక్తమును గాకపోయె సమష్టిజీవునకు తమోమోహోమహామోహ స్తామిస్రోహ్యంధసంజ్ఞకః - అవిద్యాప్రంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః అను స్మృతిప్రకారము కార్యోపాధికుడై ప్రతిబింబరూపుడై ద్విపరార్థావసానములో దేహత్యాగముగలవానికి నిత్యముక్తత ను జెప్పుట భ్రమమాత్రము వేదాహమేతం పురుషం మహాతం అను పురుషసూక్తములోని సమష్టిజీవవాక్యప్రకారము సహసిద్ధం చతుష్టయం అను స్మృతిజెప్పినరీతుగ గురువుతో పనిలేకుండ స్వయంప్రతిభాత వేదవేదార్థములు గలిగి శీఘ్రములో తత్వజ్ఞుడై యున్నాడనియు వ్యష్టిజీవులు గురుకటాక్షపాత్రులై యొకజన్మతో కొందరును బహుజన్మలతో కొందరును బహుకల్పములతో కొందరును ముక్తులగుచున్నారని జెప్పవలసె. అందుచేత బ్రహ్మనుయభ్రాంతిమయజన్మలు రెండును సమష్టిజీవునకుగలవు. పరమేశ్వరునియందవిద్యలేక తదంశలగు అండపరిపాలకనారాయణ మాయోపాధిక నారాయణాదులయందు సూక్ష్మసూక్ష్మతమ సంస్కారరూపమైయుండి కార్యోపాధికుడై ప్రతిబింబరూపుడగు సమష్టిజీవునియందు కార్యరూపముగా విలసించెననియు త్రిపాద్విభూతినారాయణుని యందు అవిద్య సర్వథా లేదనియు మాయోపాధిఉన్నదనియు మాయావిద్యలు రెండును శమించినప్పుడు పరమాత్మయు సర్వజీవులును స్వస్వరూపులగుచున్నారనియు నాలుగుపాదములు శుద్ధమగుచున్నవనియు మహానారాయణ తృతీయాధ్యాయములో వివరించియున్నది జూడుడి. ఇందుచేత మాయఈశ్వరునకే యవిద్య జీవునకేనని దెలయుడి గురునాథశాస్త్రి బ్రహ్మమయసంభవస్మృతిశ్చేత్యుక్తో ర్థః - అనాద్యవిద్యా సిద్ధతాదాత్మ్యధ్యాస నిరాకృతౌ సత్యాం స్వరూపావిర్భావలక్షణో మోక్షోభవేత్ - అతఃకిమర్థమేషా బ్రహ్మమయసంభవస్మృతిః అని బహుగా వికల్పించి సవిశేషస్యాప్రాణత్వాత్ అప్రాణోహ్యమనాశ్శుభ్ర ఇతిశ్రుతేః అని వ్రాసె. అప్రాణఇత్యాది శ్రుతినిర్విశేష బ్రహ్మవిషయముగదా - పరతః అక్షరాత్ సవిశేషబ్రహ్మణః పరః అనిజెప్పెగదా - సవిశేషమప్రాణమెట్లులయ్యె - ఆతివాహి

కమే వై షాం భూతానాం విద్యతేవపుః అత్రాధిభౌతికవ్యాప్తి రసత్యే వపిశాచికా - అను వాసిష్ఠవచనప్రకారము జీవులకు బ్రహ్మమయసంభవమనగా నాతివాహికశరీరము పూర్వసిద్ధమై నిత్యమైయుండ గానవిద్యచేత భ్రాంతిమయజన్మఅనగా నాధిభౌతికశరీరము పిశాచమువలె నావహించి తత్వజ్ఞానముచే నివర్తించి పూర్వసిద్ధబ్రహ్మమయాతి వాహికరూపస్మృతిగలుగుట తత్వజ్ఞానఫలముగాదా మహానారాయణ 3వ అధ్యాయములో సమష్టిజీవునకు జీవన్ముక్తుడై యున్నను ద్విపరార్ధావసానములో స్వకారణమైన యండపరిపాలక నారాయణునిలో నేలయమనిజెప్పె. నిర్గుణబ్రహ్మ మాత్రపరిశేషతను జెప్పదయ్యె వ్యష్టి జీవుల కిటులజెప్పుట భ్రాంతి కాదా.

బాదరాయణాద్వైతసిద్ధాంతప్రక్రియలను చక్కగా నాకళింపుజేసుకోక పిచ్చివికల్పములతో నాక్షేపించుట సరియైనదికాదు. అవిద్యానివృత్తౌస్వరూపావిర్భావలక్షణ మోక్షమనగా నిర్విశేషబ్రహ్మమాత్రతా పరిశేషముగాదు. ఆతివాహిక స్వరూపావిర్భావమేయైయున్నది సంప్రదాయక్రమమును గురువులవల్ల చక్కగా తెలుసుకొనవలె లేదా వాసిష్ఠమును బహువారము పరిశీలించియైనా నిశ్చయించుకొనవలె. యాదృచ్ఛికముగా సకృదవలోకనము చాలదు. మనవారివ్యాఖ్యలు బాదరిసంప్రదాయమునే జెప్పుచున్నవి. బాదరాయణాద్వైతసిద్ధాంతమును జెప్పవు. చాల్పునాయనేల అందుచేత ౧౮, ౧౯వ పుటలలో గురునాధశాస్త్రి జేసిన వికల్పములును ఆక్షేపములును సరియైనవిగావు యెన్నిటికని సమర్ధకము జెప్పవలెను.

మహాచితస్సముల్లాసం పరస్మాత్పరిసర్యాతాః - బ్రహ్మవిష్ణుహరాదీనాం మైస్తునబ్రహ్మణోన్యత్వం ఇత్యాదివాసిష్ఠశ్లోకములన్నియు బ్రహ్మవిష్ణ్వాదులు తత్వజ్ఞులై యవిద్యాభ్రమలజెందక నాతివాహికరూపులై ముక్తులై యున్నారని జెప్పుచున్నవి. గాని నిర్గుణబ్రహ్మలై పోయినారని జెప్పలేదు. అపంచీకృతభూతములు చిన్మయములు ఆతివాహికములుగాని జడములుగావు.

గురునాథశాస్త్రి జిజ్ఞాసాసూత్రార్థములో మేము బ్రహ్మపదముచేత సవిశేషనిర్విశేషోభయరూపము జిజ్ఞాస్యమని వ్రాసినదాని నాక్షేపించె. నిస్సంచారశ్చరాత్మా సకలమసకలంచేతి సిద్ధాంతసారః అను వాసిష్ఠవచనముకు మేము జెప్పిన తాత్పర్యము నాక్షేపించి నిస్సంచారశ్చరాత్మేతిసకలం అని ఇతిశబ్దమును జేర్చి అసకలం అనగా నిష్ప్రపంచంబ్రహ్మైవఅని బాధాసామానాధికరణ్యము జెప్పుట సముచ్చయవాచక చకారమును వ్యర్థపరచుటయుసాంప్రదాయికార్థమని వ్రాసె- అనేజకం మనసోజవీయః - తదేజతితన్నైజతితద్దూరే తద్వంతికే - సంమదామదందేవం ఇత్యాదిశ్రుతులకుగూడా బాధాసామానాధికరణ్యమే జెప్పగలడు. నిర్గుణరూపము నిస్సంచారము సగుణసాకారరూపముచరాత్మ - ఇదియే సకలరూపమనగా సర్వాత్మకము అశేషవిశేషములుగలది నిర్గుణరూపము అసకలమనగా యేవిశేషములులేనిది సజాతీయాదిభేదములేనిదన్నమాట- ఇట్టిరూపద్వయము పరమాత్మకు స్వభావసిద్ధము పరమార్థసత్యమని వెనుక సిద్ధాంతపడియున్నది. ఇట్టిస్థితిలో బాధాసామానాధికరణ్యమును జెప్పుట యెట్టిసంప్రదాయికమో విచారించుడి- వెనుకగ్రంథములో శ్రుతిస్మృతులకు ఉపక్రమాదిలింగములచే సగుణసవిశేషబ్రహ్మ ముఖ్యముగా జిజ్ఞాస్యమనిజెప్పియున్నారము జూడుడి.

బ్రహ్మాదిశబ్దములకు జహల్లక్షణ జెప్పగూడదని జహదజహల్లక్షణే జెప్పవలెనని సంప్రదాయము- అందులో వాచ్యార్థమందు జీవావిద్యాధ్యస్తమిథ్యారూపమును జహత్ అనగా త్రోసివైచి సర్వజ్ఞపరమేశ్వర ప్రథమేక్షణసిద్ధవిద్యాప్రపంచమును అనగా సర్వాత్మక సగుణ పరమార్థరూపమును - అజహత్ - అనగా విడువకుండా నిర్గుణ రూపమందు లక్షణజెప్పడముగదా ఇట్టిస్థితిలో వీరియాక్షేపణలు అక్కరకు రావు.

గురునాథశాస్త్రి జన్మాదిసూత్రములో మేము అస్యయను పదముకు విద్యాప్రపంచమర్థమన్నందు కాక్షేపించి అజ్ఞజీవులకు ప్రత్యక్షాది సర్వప్రమాణసిద్ధమైన యావిద్యాప్రపంచమును జెప్పుటే సాంప్ర

దాయికమని, లేనియెడల చాలా బాధకములున్నవని జెప్పె. బాదరి మ
తానుసారముగా విద్యా విద్యాప్రపంచ విభాగములేకుండ సర్వము
మిధ్య ఈశ్వరుడును మిధ్యయని జెప్పువారికి బాధకములే కోచునుగాని
బాదరాయణసిద్ధాంతానుసారముగ విషయవాక్యసన్నిధాపి తేక్షణాది
ప్రవేశాంత విద్యాప్రపంచసత్యత్వమును జీవావిద్యాసిద్ధపంచీకృతజడ
ప్రపంచమిధ్యాత్వమును జెప్పువారికియే బాధకములుండ నేరవు. నోత్ప
న్నం నస్థితంఅను శ్రుతిజగత్ కార్య కారణభావా చ్చేత్కథైవాత్ర
నవిద్యతేయని వాసిష్ఠవచన ప్రకారము భ్రమసిద్ధమైన యవిద్యాప్ర
పంచముకు స్వరూపమే లేనప్పుడు కార్యత్వమెక్కడిది. పరమాత్మకు
తన్నిరూపితకారణత్వ మెక్కడిది. శ్రుతిస్మృతులు జెప్పలేదుగదా సరి
యైన సాంప్రదాయికార్థముల నాలోచించకుండ నాక్షేపించుట సరి
యైనదిగాదు. విద్యాప్రపంచము బ్రహ్మవేత్తలకు ప్రత్యక్షవిషయమే
గాన ఇదమదర్శ్యబ్దములు సంగతములే విద్యాప్రపంచములో చిన్మయా
పంచీకృత భూతభౌతికముల కావిర్భావతిరోభావములే జెప్పబడినవి
గాని జన్మనాశములను జెప్పలేదు. భవదీయమతప్రవేశముకూడా దో
షముకాదు. కొన్ని యంశములకై కకంఠ్యముండవచ్చును.

ఆనందవల్లీ తాత్పర్యదీపికలో స్వవచనవ్యాఘాత మెంతమాత్ర
మును లేదు. భాష్యకర్తబాదరిమతానుసారముగా పంచీకృతా పంచీ
కృత సర్వప్రపంచము పరమేశ్వర సృష్టమనియు సర్వప్రపంచము మి
ధ్యయని జెప్పియున్నారు. పరమేశ్వరసృష్టము మిధ్యయనుట యసంగ
తమేగదా పరమేశ్వరునే మిధ్యయని జెప్పువారికి యసంగతమేమని
యందురేమో మేమటుల జెప్పలేదు. ఆనందవల్లీలో తస్మాద్వా ఏత
స్మాదిత్యాది వాక్యముచేత ముందుగా సముద్ధాకారముగా పంచీకృతా
పంచీకృతభూతభౌతిక ప్రపంచమును జెప్పి అథాతోఽనుప్రశ్నాః అని
కొన్ని ప్రశ్నలనుజూపి సోఽకామయతేత్యాది గ్రంథములో నీక్షణకా
మనాలోచనాది పూర్వకముగా సర్వజ్ఞుడగు పరమాత్మచిన్మయా పం
చీకృతపరమార్థ సత్య విద్యాప్రపంచమునంతయు సృజియించి
అందులో ప్రతిబింబరూపముగ ప్రవేశించినాడని తదనుప్రవిశ్యలన

గా ప్రవేశించినవిమ్మట విద్యాప్రపంచమంతయు ప్రతిబింబులయొక్క-
అవిద్యాముగ్ధదృష్టిలో పంచీకృతజడసుఖాదిరూపమై కొంత వ్యావహా
రికమై కొంత ప్రాతిభాసికమై అయినదని జెప్పియున్నదనియు అందుచే
త పరమేశ్వరునిరభిసంధిసృష్టమగు విద్యాప్రపంచము పరమార్థసత్య
మనియు దానియందు రజ్జువుయందు సర్పమువలెనవిద్యాముగ్ధజీవులకు
దోచిన పంచీకృతజడప్రపంచము మిథ్యయనియు ఇది బాదరాయణ
వైదికసిద్ధాంతమని జెప్పియున్నాము. వ్యాహతమెటులనగును జన్మాది
సూత్రములోను యతోవాఇమానియను శ్రుతిలోనుండు ఇదంపదము
కు విద్యాప్రపంచమునే జెప్పి యవిద్యాప్రపంచమును వదిలినందుకు
సంకోచేమా నాభావాత్ అని వ్రాసె- మానము లేకపోవుటేల - సత్య
త్వమిథ్యాత్వములే ముఖ్యకారణములై యుండలేదా విచారించితే కా
రణాంతరములును గనుపించగలవు. భృగువల్లీలోని మానిపరిదృశ్యమా
నాని యను వాక్యముతోను విరోధములేదు. బ్రహ్మనిత్పరిదృశ్యమా
నాని యనియర్థము.

గురునాధశాస్త్రి ౧౫౫వ పుటలో ప్రాతిభాసిక వ్యావహారిక ప్ర
పంచవైలక్షణ్యమును కొంతవివరించి - బ్రహ్మపరోక్షసాక్షాత్కారే
ణ ప్రమాణప్రమాతృప్రమేయాది సర్వజగద్బాధేకిమ పరమవశిష్య
తేయనియు సోకామయతయన్నది మొదలు సత్యంచానృతంచస
త్యమభవత్ అన్నంతవరకు జెప్పబడిన కామనసర్జన ప్రవేశభవనా
దులకు సమానకర్తృకత్వమనియు వ్రాసి నదిసరికాదు - సర్వస్యాపి
బ్రహ్మకార్యత్వరూపబ్రహ్మ ఏవకర్తృత్వస్యావగమాత్ అని వ్రాసినది
యును సరికాదు. బ్రహ్మపరోక్షతవలన జీవుడు జడమైపోవుగదా. మ
రేమన సర్వజ్ఞుడగుచున్నాడు. అందుచే నావిద్యకప్రమాత్రాది త్రిపుటి
నివర్తించినను ఆత్మమాత్రమై సర్వము గలిగేయున్నది. ఈక్షణాదిప్ర
వేశాంతమే పరమేశ్వరకార్యము సచ్చత్యచ్చాభవదిత్యాద్యుక్తభవన
ముపరమాత్మకర్తృకముగాదుగదా కర్మకర్తృత్వమే జెప్పబడెగదా స
త్యమిథ్యావస్తువిభాగమును జెప్పకుండా సర్వముబ్రహ్మకార్యమనియు
సర్వము మిథ్యయనియు జెప్పుటయుక్తమని జెప్పువారికి నారాయణస్మ

రణమే యుత్తరము దొంగనిద్రబోవువారిని మేలుకొలుప శక్యముగునా అవిద్యాప్రపంచము జీవకల్పితమనెడి యభియుక్తవచనముకు తస్యత్రయ ఆవసథాస్త్రయస్స్వప్నాః అని శ్రుతిచేజెప్పబడిన జీవభోగ్యత్వమూలకమని తాత్పర్యమును తొలగదీసెగాని తొలగిపోదయ్యె. జాగ్రత్స్వప్నసుషుప్తులు మూడును జీవులకవిద్యాకల్పితములేగాన జాగ్రత్స్వప్నప్రపంచములు రెండును జీవావిద్యాకల్పితములై జీవభోగ్యములగుచున్నవి. ఈశ్వరకల్పితములు గావుగాన నీశ్వరభోగ్యములు గావు.

గురునాధశాస్త్రి తాత్పర్యార్థ విమర్శ ౧౯, ౨౦ పుటలలో కించానందవల్లీ తాత్పర్యదీపికాయామిత్యాదిగ్రంధములో - ఇదగ్ంసర్వమసృజత అనువాక్యముకు - ఇదంచరాచరాత్మకం సర్వం అంటినునియు ఇదమేవమాయికం విశ్వరూపమంటిమనియు భృగువల్లీతాత్పర్యదీపికతో విరోధమున్నదనియు విద్యాప్రపంచమును సృజించి అందులో ప్రవేశించుటచేత జీవత్వము ప్రాప్తించినదన్నామనియు విద్యాప్రపంచముచిదేకగసమైతే నచ్చుట మాలిన్యమే సంభవించదనియు దానిలో ప్రవేశించినవానికి యెటులుగా నావిద్యకానుభవముగలుగుననియు నాక్షేపించే - అపంచీకృత తేజోబన్నములవల్ల బుట్టిన అండజాదిజీవ బీజములలో ప్రతిఫలించినప్పుడు మూడుభూతముల తారతమ్యమునుబట్టియు తదీయసత్వములో రజస్తమస్సుల మేళనముచేతను తారతమ్యముచే మాలిన్యమురావచ్చును-ఉపాధి ప్రతిబింబపక్షపాతి గాన నందులో ప్రతిఫలించిన జీవులకు అవిద్యగలిగి అవిద్యాప్రపంచాధ్యాస గలుగవచ్చును. తత్వజ్ఞానముచే నుపాధిమాలిన్యముబోయి శుద్ధమైతే అధ్యాసభ్రమనివర్తించవచ్చును. శాస్త్రమారీతిజెప్పుచున్నది. అటుల నాకళింపుచేసుకొనక మమ్ములనాక్షేపించుట యుక్తముకాదు. అస్మన్మతేతు అని వ్రాసిన తమమతములో నామరూపాత్మక జగదభివ్యక్త్యనంతరం తత్రప్రవేశేనాభివ్యక్తోపాధిదోషాత్ అనివ్రాసె అనగా నామరూపాత్మక జగత్తుజడమని తాత్పర్యముగదా చిదుపాదానక జగత్తుజడ మెట్లులగును.

జలోపాదానకతరంగము మృణ్మయముగునా - సత్యంజ్ఞానమనం

రీతిగదా మహాచితస్సముల్లాసం ముహ్యంతీ వనకేచన - యేనామతే జగత్యేతే బ్రహ్మవిష్ణు హరాదయః - కణాస్తృప్తాయస ఇవవారిధేరివ బిందవః ఇత్యాది శ్లోకములలో జెప్పబడిన బ్రహ్మాదులు విద్యాప్రపంచములో వారు కారా వారు పరమార్థ సత్యులుగారా యెక్కడా వాసిష్ఠ శ్లోకములలో మేము చెప్పిన విద్యాప్రపంచ ప్రశంస లేనే లేదని వ్రాయుట కండ్లుమూసుకుని వ్రాయుట గాదా విమర్శించుడి

శాస్త్రయోనిత్వాధికరణములో భాష్యకర్త మొదలగు వారి శ్రుత్యర్థ వివరణప్రస్థానము బాదరి మతాను సారముగా నాలుగు వేదములు సోపాధిక నిరుపాధిక రూపద్వయ ప్రకాశకములనియు నిరుపాధిక రూపము నిర్గుణ నిర్విశేష బ్రహ్మయనియు సోపాధిక రూపము కార్యబ్రహ్మ రూపమనియు అది మిథ్యయనియు నిరూపించుచున్నది. మాగ్రంథములు నిరుపాధిక నిర్గుణబ్రహ్మరూప మొకటియు మాయోపాధిక సగుణబ్రహ్మరూప మొకటియు ఉభయము పరమార్థ సత్యమేననియు దానియందవిద్యాధ్యస్త పంచీకృత జడ ప్రపంచరూపము మిథ్యయనియు జెప్పుచున్నవి. మహానారాయణములో మాయోపాధిక రూపము నిరుపాధికసాకారమనియు నిత్యమనియు అవిద్యోపాధిక సాకారము సోపాధికమని యనిత్యమని యసత్యమని జెప్పి యున్నది ఇందువల్ల నెవరిది సాంప్రదాయకమో యెవరిది అసాంప్రదాయకమో తెలియవచ్చును. గురునాథశాస్త్రి వ్రాసిన తక్కిన కువికల్పముల కన్నిటికిని వెనుకనే సదుత్తరముల నిచ్చియున్నారము ముండకశ్రుతిలో తదేతత్సత్యం అని ఉపక్రమించిజెప్పిన సవిశేష రూపము సర్వము పరమేశ్వర ప్రతిపత్తిహేతువనియు దానిని భాష్యకారాదులు నిర్విశేషబ్రహ్మ ప్రతిపత్తిహేతువుగానభివ్యంజన జేసియున్నారని వ్రాసిన మాటలోనుండు గూఢతాత్పర్యము నాలోచించుడి పరమేశ్వరుడును సర్వవిశేషములును సర్వము నిర్విశేష ప్రతిపత్తికై జెప్పబడినవి మిథ్యయని గదా బహు నాగరికముగా సూచించె.

ఇట్లు శాస్త్రయోనిత్వాధికరణములో బ్రహ్మయొక్క రూపద్వయమును జెప్పి సమన్వయ సూత్రములో తచ్ఛబ్దముచేత రూపద్వ

యమును పరామర్శించితే బ్రహ్మపరిత్య క్తముగా లేదు. అప్రకృతప్ర సంగమున్నూ లేదు. ద్విరూపం బ్రహ్మవిభాతియను భాష్యవాక్యమును తీసుకుని తదుత్తరవివరణవాక్యమును వదిలినదెందుకనగా - నామరూపవికారభేదోపాధివిశిష్టమంటే వికారశబ్దము కార్యవాచకముగాన కార్యబ్రహ్మరూపమును జెప్పినదిగాని కారణబ్రహ్మను జెప్పలేదు. అది అసాంప్రదాయికముగాన వదిలితిమి

చిన్మయస్యాద్వితీయస్య అను రామతాపనీయోపనిషద్వాక్యములో ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా అను ఉత్తరార్థమునకు వారు ఉపాసనార్థము కల్పించబడిన రూపము జీవకల్పితమని మిథ్యయని దానినే ఉపాసించితే ఫలము సంవాదిభ్రమరూపముగా సిద్ధించుననియు తాత్పర్యబజుచున్నారు. నిర్గుణరూపము జ్ఞేయమేగానందున భక్తులకుతరించు నుపాయమేలేక పోవలసిన స్థితిలో పరమాత్మసగుణరూపమును స్వేచ్ఛచేత ధరించినాడని అందుచేత స్వతస్సిద్ధమని పరమార్థసత్యమనినమ్మి ధ్యానించి భజించి భక్తులు తరించవలెనని మేముజెప్పుచున్నాము ఈరెంటిలో నెద్దిసాంప్రదాయికమో యేదికాదో విమర్శించుడి.

తహివాచ్యమిథ్యాత్వే సర్వమిథ్యాత్వప్రసక్తిః అనినమాట కేమి పరిహారమంటివాయని వికల్పించివ్రాసిన సందర్భమంతయు పిచ్చిసందర్భమే వేరు జెప్పనక్కరలేదు. బ్రహ్మవిద్బ్రహ్మైవభవతియను శ్రుతికి నిర్విశేషబ్రహ్మమై పోవునని యర్థముకాదు - ఉభయరూపుడౌనని యర్థము సాంప్రదాయికము.

సగుణోపాసనకు అవిద్యకాణిమాదిప్రాప్తియే ఫలమనియు విద్యాప్రపంచములో ముక్తులకణిమాది సిద్ధులులేవనియు బాదరిమతానుసారముగ నభిప్రాయపడి గురునాథశాస్త్రి - పాతంజలసూత్రాదులను కొంతయుదహరించి(అణిమాద్యైశ్వర్యఫలక మిత్యేతదుపదేశరూపో భగవతః పతంజలిమహామహేశ్వరపరాధస్సర్వజ్ఞ మూర్ధన్యశిరసిసమారోపితస్స్వామినా) అని చాలానాక్రోశించివ్రాసె భాష్యకారాదులుగూడ నీయభిప్రాయమునే సగుణోపాసనకు సంసారమే ఫలమని -

లేక నివేసాంప్రదాయికములో బాగా విమర్శించుకుని తర్వాత మా మీాద కోపించితే సంతసింప గలము.

పరలోక యాత్రకు సిద్ధమైయున్న మాకు మీాహర్షకోపము ల కించిత్కరములని దలంచుడి పరమేశ్వరావతారులగు శ్రీ శంకరా చార్యుల వారిని త్రికరణములచే భజియించుడి మేమును భజియింపు చున్నారము గాన సర్వము శివంకరమే సరి.

ఓం నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే - సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగధారిణేనమః

బాదరాయణ సిద్ధాంతో మగ్నో మతమహాంబుధౌ - అద్వై తానందతీర్థేన కలౌపునరిహాద్ధృతః

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మత్సదానంద

తీర్థశిష్య శ్రీ మద్వ్యాస ప్రసాదాసాదితతత్త్వనిశ్చయ

అద్వైతానంద తీర్థ విరచితం

దీపికామండనం

సమాప్తం



